# Let's make the world a sweeter place to live in.



I'm planting a Tulsi tree. Hope it grows into a B-I-I-G one.



Lovable, blind Chacha Kunwar. He's been my parents' guide. The least I can do is help him cross safely.



Aha! This time Dad's got the flu and Mum's told me to give him a dose of medicine.



Gangu Bai has coolly taken the day off. Leaving Radha Mausi and me in a soapy mess.



Before that rich glutton of a Raju snatches my Kaju Barfi, let me give it to poor Smita..



Naughty Timmy has got himself hurt. Now this lil' Doc will set him right.



I'm helping Uncle Rajeev with the car repairs. Though Mum said "I'll be a spanner in the works".



With Chandra, my maths teacher, numbers are fun. Time I gave her a dozen smiling roses.




Ravalgaon™

Years and years of sweet success

Avenues RS 100 96

F.1



# చందమామ

ఆగస్టు 1996






విడిప్రతి :6.00
సంవత్సర చందా : 72.00

# JUST RELEASED

The first set of **Chandamama Books,** splendid in their content, illustrations, and production, is now ready.




Rs. 30/-




Rs. 40/-




Rs. 30/-




Rs. 30/-




Rs. 25/-




Rs. 30/-

Discount for members of **Chandamama Young Scholars Club.**

For details, write to :



**CHANDAMAMA BOOKS**
Chandamama Bldgs.
Vadapalani, Madras - 600 026.




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'    సంచాలకుడు : నాగిరెడ్డి



## ఒకే విధమైన విద్యావిధానం

కొన్ని పాఠశాలలలో పిల్లలను చేర్పించడానికి తల్లిదండ్రులు ఎగబడుతూ ఉంటారు. అక్కడ సీటు దొరకడమే దుర్లభంగా ఉంటుంది. మరికొన్ని పాఠశాలలలో, కొన్ని ప్రభుత్వ ఆదేశాలను పూర్తి చేయాలని, అక్కడి ఉపాధ్యాయులే పిల్లలను చేర్పించడానికి తంటాలు పడుతూ ఉంటారు. తరగతికి కనీసం 32 మంది విద్యార్థులు ఉండాలి. యాభైమందికి పైబడితే రెండు సెక్షన్లు ఉండాలి. తొంభైమందికి దాటితే మూడు సెక్షన్లు ఉండాలి. ప్రాథమిక పాఠశాల అయితే కనీసం వందమంది విద్యార్థులు ఉండాలి. ప్రధాన ఉపాధ్యాయుడితో కలిసి నలుగురు ఉపాధ్యాయులు ఉండాలి – ఇటువంటి నిబంధనలను ప్రభుత్వం ఆదేశిస్తుంది. వాటిని పూర్తి చేయకుండా పాఠశాలలను నడపడం కష్టం!

మన దేశంలో, ముఖ్యంగా పట్టణ నగర ప్రాంతాలలో ఇంగ్లీషు మీడియం పట్ల ఆకర్షణ ఉన్నది. అందువల్ల ఉన్నత ప్రమాణాలతో ఇంగ్లీషు మీడియంలో విద్యాబోధన చేసే పాఠశాలలలో రద్దీ ఎక్కువగా ఉంటున్నది. కాబట్టి ప్రభుత్వ పాఠశాలలయినా, ఇతరులు నిర్వహించే పాఠశాలలయినా ఉన్నత ప్రమాణాలతో విద్యను బోధించాలి. అన్ని పాఠశాలలలోనూ ఒకేరకమైన విద్యాప్రణాళిక ఉండాలి. అలాంటప్పుడే ఇంటికి దగ్గరగా ఉంటే చాలు, ఏ పాఠశాలలోనైనా పిల్లలను చేర్పించవచ్చు అనే అభిప్రాయం తల్లిదండ్రులకు ఏర్పడుతుంది!

సంపుటి : 99    ఆగస్టు'96    సంచిక : 2

విడిప్రతి : 6.00    సంవత్సర చందా :    72.00






# చందమామ

మహోన్నతమైన భారతీయ సంస్కృతిని – నెలనెలా మనోహరమైన కథల ద్వారా విశదీకరిస్తుంది.

64 పేజీల నిండా అందమైన వర్ణ చిత్రాలతో, సుప్రసిద్ధ పౌరాణిక గాథలను, అద్భుతమైన దేశ విదేశ జానపద కథలను – రసవత్తరమైన చారిత్రక అంశాలను, మహనీయుల జీవిత విశేషాలను – విజ్ఞాన వినోదాలు విరజిమ్మే వివిధ శీర్షికల ద్వారా అందజేస్తుంది.

**11 భారతీయ భాషలతో పాటు, సంస్కృతంలోనూ వెలువడుతున్నది.**

చందా వివరాలకు రాయండి :

డాల్టన్ ఏజన్సీస్, 188, ఎన్.ఎస్.కె. రోడ్ మద్రాసు - 600 026.

వార్తలు - విశేషాలు:

# రెండవ మహిళా ప్రధాని

మనపొరుగుదేశమైన బంగ్లాదేశ్ మొట్టమొదటి మహిళా ప్రధానమంత్రిగా బేగం ఖలీదా జియా1991 నుంచి 1996 వరకు పరిపాలించారు. ఫిబ్రవరిలో జరిగిన ఎన్ని కలలో ఆమె మళ్ళీ ప్రధాని అయ్యారు. కాని, ఆ ఎన్నికలను ప్రతిపక్షాలన్నీ బహిష్కరించడంతో ఆమె రాజీనామా చేయాలని దేశవ్యాప్తంగా అలజడి ప్రారంభమయింది. పర్యవసానంగా ఆమె రాజీనామా చేశారు. జూన్ 12వ తేదీ మళ్ళీ ఎన్నికలు జరిగాయి. షేక్ హసీనా నాయకత్వంలోసంకీర్ణ ప్రభుత్వం ఏర్పడింది. షేక్ హసీనా వాజేద్ బంగ్లాదేశ్ రెండవ మహిళా ప్రధాని అయ్యారు.



బంగ్లాదేశ్ జాతిపితగా పేరుగాంచిన షేక్ ముజిబుర్ రహమాన్ పెద్ద కుమార్తె షేక్ హసీనా. ముజిబుర్ రహమాన్ అవామీలీగ్ పార్టీకి నాయకత్వం వహించి తూర్పు పాకిస్తాన్ స్వతంత్రం కోసం పోరాడారు. ఇస్లామాబాద్ రాజధానిగా గల పాకిస్తాన్‌ను వ్యతిరేకించి అంతర్యుద్ధం బయలుదేరింది. అప్పుడు వేలాది మంది ప్రజలు మన దేశానికి శరణార్థులుగా రాసాగారు. వారిని స్వస్థలానికి తరలించే ప్రయత్నంలో ఇండియా పాకిస్తాన్ వ్యవహారంలో జోక్యం చేసుకోవలసి వచ్చింది. 1971వ సం॥లో జరిగిన ఇండో-పాక్ యుద్ధానంతరం తూర్పు పాకిస్తాన్ స్వతంత్రం పొందింది. నూతనదేశం బంగ్లాదేశ్‌గా ఏర్పడింది.

1972వ సం॥లో ముజిబుర్ రహమాన్ బంగ్లాదేశ్ అధ్యక్షుడయ్యాడు. రాజధాని ఢక్కాలో 1975ఆగస్టు 15వ తేదీ ముజిబుర్ రహమాన్ కుటుంబంతోసహా హత్యచేయబడ్డారు. ఆ సమయంలోఆయన పెద్ద కుమార్తె హసీనా జర్మనీలో ఉండడం వల్ల ప్రాణాలతో తప్పించుకున్నది.

1977వ సం॥లో బంగ్లాదేశ్‌లో మళ్ళీ సంక్షోభం బయలుదేరింది. జనరల్ జియా ఉర్ రహమాన్ అధ్యక్షుడయ్యాడు.ఆయన 1981వ సం॥లో హత్య చేయబడ్డాడు. 1982వ సం॥లో జరిగిన తిరుగుబాటులో లెఫ్టినెంట్ జనరల్ హుస్సేన్ మహమ్మద్ ఎర్షాద్ అధ్యక్షుడై సైనికపాలన ప్రకటించాడు. 1986వ సం॥లో సైనిక పాలన తొలగించబడి ఎన్నికలు జరిగాయి. ఎర్షాద్ జాతీయ పార్టీ గెలుపొందింది. కాని, విజయం వివాదాస్పదమయింది. అయినా, ఆయన 1991 వరకు అధికారంలో కొనసాగాడు. 1991వ సం॥లో జరిగిన ఎన్నికలలో జియా ఉర్ రహమాన్ వితంతువు బేగం ఖలీదా జియా నాయకత్వంలో బంగ్లాదేశ్ నేషనలిస్ట్ పార్టీ అధికారంలోకి వచ్చింది. జనరల్ ఎర్షాద్ లంచగొండితనం అభియోగాల కారణంగా జైలు పాలయ్యాడు.

ముజిబుర్ రహమాన్ కుమార్తె షేక్ హసీనా 1981వ సం॥లో స్వదేశానికి తిరిగి వచ్చి అవామీలీగ్ పార్టీ నాయకత్వం చేపట్టింది. బంగ్లా దేశ్ పార్లమెంటు జాతీయ సంగసద్‌లో అవామీలీగ్ ప్రతిపక్షంగా ఉంటూ వచ్చింది.

జూన్ 12వ తేదీ జరిగిన ఎన్నికలలో అవామీలీగ్ అధిక స్థానాలు (146) గెలుచుకున్నది. బంగ్లాదేశ్ నేషనలిస్ట్ పార్టీకి 116 స్థానాలు లభించాయి. జాతీయ పార్టీకి 30 స్థానాలు లభించాయి. 300 స్థానాలు గల పార్లమెంటులో అధికారం చేపట్టడానికి కావలసిన మెజారిటీ లేకపోవడంతో, అవామీలీగ్ ఇతర పక్షాల మద్దతుతో సంకీర్ణ ప్రభుత్వం ఏర్పాటు చేసింది. జనరల్ ఎర్షాద్ జైలులో ఉంటూనే నూతన ప్రభుత్వానికి మద్దతు తెలియ జేశాడు. షేక్ హసీనా 25మందితో నూతన మంత్రిమండలిని ఏర్పాటు చేసింది.రెండవ మహిళా ప్రధానిగా పదవీబాధ్యతలు చేపట్టిన తరవాత షేక్ హసీనా పార్లమెంటులో మాట్లాడుతూ - ఇది సంకీర్ణ ప్రభుత్వం అయినప్పటికీ ముఖ్యమైన సమస్యలను పరిష్కరించడంలో సభ్యులందరి అభిప్రాయాలను గౌరవించే ప్రభుత్వంగా ఉంటుంది, అని అన్నారు.



# పట్నంమొగుడు-పల్లెటూరిపెళ్ళాం

చిన్నతనంలోనే తల్లిదండ్రులను పోగొట్టుకున్న కమలాకరుడిని అతని అవ్వ పెంచి, పెద్ద చేసింది. అతడికి చదువు సంధ్యలు బాగా అబ్బినై. ఉద్యోగరీత్యా నాలుగేళ్ళుగా పట్నంలో వుంటున్నాడు. అవ్వకు పుట్టి పెరిగిన పల్లె వద లడం ఇష్టం లేక, అక్కడే ఒంటరిగా ఉం టు న్నది. అదే పల్లెలో దూరపు బంధువును పెళ్ళా డిన కమలాకరుడి అక్క, అవ్వ మంచి చెడ్డలు చూస్తూండేది.

ఒక రోజున అవ్వకు ప్రాణాల మీదికి వచ్చి నట్టుగా కబురందింది కమలాకరుడికి. ఆఖరి చూపు కూడా దక్కుతుం దో లేదో అని దిగులు పడుతూ పల్లె చేరాడతను. అవ్వ ఊపిరి తీసు కోవడానిక్కూడా ఎంతో కష్టపడుతున్నది. కమలా కరుడు వచ్చాడని తెలిశాక ఆమె కళ్ళు తెరిచి, "నీ పెళ్ళి కళ్ళ చూడనిదే, ఈ ఘట ం వెళ్ళదురా, కమలాకరా! రెండేళ్ళుగా పోరుతున్నాను. నాకోరిక తీర్చావు కాదు," అంటూ కళ్ళ నీళ్ళు పెట్టుకున్నది.

కమలాకరుడికి పల్లెటూరి పిల్లను చేసుకో వడం ఏమాత్రం ఇష్టం లేదు. అందంగా, నాజూగ్గా, చురుగ్గా వుండే పట్నం అమ్మాయిని చేసుకోవాలని, అతడు కలలు కంటున్నాడు.

"నీ ఆరోగ్యం ముందు బాగుపడనీ,అవ్వా! ఈ శ్రావణంలో అలాగే చేసుకుంటాను," అన్నాడు కమలాకరుడు, అవ్వ కాళ్ళు వత్తుతూ.

"ఒరే, చెప్పానుగా, నాకు పిలుపు వచ్చే సింది! నీ పెళ్ళి చూసి, నన్ను తృప్తిగా కళ్ళు మూయనీ, మంచి ముహూర్తం – రేపే కామాక్షితో నీ పెళ్ళి," అన్నది అవ్వ.

కామాక్షి పక్కింటివాళ్ళ పిల్ల. ఎంతో కాలంగా అవ్వకు చేదోడువాదోడుగా వుంటున్నది.

కమలాకరుడు అయిష్టంగా తల వూపి ఏదో చెప్పబోయేంతలో, అతడి అక్క చెయ్యి పట్టుకుని పక్కకు తీసుకుపోయి, "కామాక్షి అన్ని విధాలా నీకు తగిన పిల్ల. అవ్వ నాలుగైదురోజుల కంటే ఎక్కువ బతకదని

మాచిరాజు కామేశ్వరరావు

వైద్యుడు చెప్పాడు. అవ్వ మనకు చేసిన మేలుకు ఆవిడ ఆఖరు కోర్కె తీర్చడం మన ధర్మం!" అన్నది.

ఈ విధమైన ఒత్తిడి కారణంగా, కమలా కరుడికి బొత్తిగా ఇష్టం లేకపోయినా, పల్లెటూరి కామాక్షితో అతడి పెళ్ళి జరిగిపోయింది.

ఈ పెళ్ళి కళ్ళజూసిన మరుక్షణం, అవ్వ మంచం దిగింది. అనారోగ్యం మంత్రం వేసి నట్లుగా మాయమైంది.

వారం తర్వాత, కమలాకరుడు, కామాక్షితో పట్నం బయలుదేరాడు. అవ్వ అతడితో, "ఈ మాసంలోనే మీరిద్దరూ,రామాపురంలోని రామా లయాన్ని తప్పక దర్శించండి. నాకు మొక్కు ఉన్నది," అని ఒకటికి రెండుసార్లు చెప్పింది.

బాడుగబండిలో పట్నం వెళుతున్నప్పుడు కమలాకరుడు, భార్యతో, "నువ్వు పల్లెటూరి మొద్దులా, పట్నంలోని అంగళ్ళనూ, వీధులనూ, మేడలనూ చూస్తూ కళ్ళింత చెయ్యకు. కాస్త గొంతుతగ్గించి మాట్లాడటం, పళ్ళు కనిపించ కుండా నాజుగ్గా నవ్వడం అలవాటు చేసుకో," అన్నాడు.

పట్నంలో కొత్త కాపురం కామాక్షికి బాగానే ఉన్నది. అయితే, అనుక్షణం భర్త పల్లెటూరి దానవంటూ, అవహేళన చేయడం ఆమెకు బాధగా ఉండేది.

"కనుగుడ్లు పైకి పొడుచుకువచ్చేలా, అంత బిగించి జడ వేసుకోవడం ఎందుకు? అమ్మోరిలా మొహాన అంత పెద్ద బొట్టేమిటి? అవ్వలా ఒంటికి చీర చుట్టుకోవడం కాదు. కొత్తగా కాపరానికి వచ్చిన దానిలా కట్టుకోవడం నేర్చుకో!" అంటూ కామాక్షిని కోప్పడుతూండే వాడు కమలాకరుడు.



అయితే, ఇరవైరోజులు తిరక్కుండా కామాక్షి, పట్నం అమ్మాయిల కట్టూ బొట్టూ అలవరచుకోగలిగింది. అయినా, కమలా కరుడు ఆమెను మెచ్చుకునే దానికి బదులు, "నువ్వెంతలా మారినా, చూడగానే నువ్వు పల్లె టూరి మొద్దువని ఎవరైనా గ్రహించేస్తారు. అడ్డమైనవాళ్ళందరితో మాట్లాడకు. ముక్కూ మొహం తెలియనివాళ్ళను ఇంట్లోకి రాని వ్వకు. ఇట్టే మోసం చెయ్యగలరు!" అంటూ ఉద్యోగానికివెళుతూ, రోజూ భార్యకు హెచ్చ రికలు చెబుతూండేవాడు.

వాళ్ళు పట్నంవచ్చి నెల కావస్తూండడంతో, అవ్వ రాములవారి మొక్కు భర్తకు గుర్తు చేసింది కామాక్షి. "అవ్వ అనారోగ్యం, పెళ్ళి పేర్లతో ఈ మధ్యే పదిరోజులు సెలవు వాడు కున్నాను. నా పైఅధికారి పేరుకు తగినట్లుగా



ఉగ్రనరసింహం. ఇప్పట్లో ఇక ఒక్క రోజు సెలవు కూడా ఇచ్చేది లేదని ఖచ్చితంగా చెప్పేశాడు," అన్నాడు కమలాకరుడు.

కామాక్షి క్షణం ఆలోచించి, "మీ పైఅధికారి పేరు ఉగ్రనరసింహం అయితే, వాళ్ళ ఇలవేల్పు నరసింహస్వామిఅయివుంటాడు. మన మొక్కుబడి నరసింహస్వామిదేనని చిన్న అబద్ధంచెప్పి చూడండి," అన్నది.

ఆమె సలహా అద్భుతంగా పనిచేసింది.

"అందరు స్వాముల వంటివాడు కాదు, నరసింహస్వామి! ఆయన మొక్కులు చెల్లించడంలో, ఏమాత్రం ఆలస్యం పనికి రాదు. ఒక రోజు సెలవిస్తాను. రేపే బయలు దేరండి!" అన్నాడు అధికారి తొందరపెడుతూ.

మర్నాడు చీకటితోటే, భార్యాభర్తలు బాడుగబండిలో రామాపురం బయలుదేరారు. కమలాకరుడు ఒక బంగారుగాజుల జత కామాక్షికిచ్చి, "మా అక్కగాజులివి. రామాపురం బంగారుకొట్లలో, ఎక్కడా దొరకని కొత్తరకం గాజులు దొరుకుతాయట! ఈ పాత గాజులు మార్చి, కొత్తరకంవి తీసుకోమన్నది. పెట్టెలో అడుగున దాయి," అన్నాడు.

వాళ్ళు రామాపురం చేరేసరికి మధ్యాహ్నం అయింది. ఊరి మొదట్లో ధర్మసత్రం ఉన్నది. భార్యాభర్తలు బండి దిగారు.

"ఖాళీగదులు లేవు!" అన్నాడు సత్రం ఉద్యోగి.

ఇది విని, కమలాకరుడు ఉస్సురుమన్నాడు. కామాక్షి కల్పించుకుని ఉద్యోగితో, "రామ శాస్త్రిగారు మా ఇంటికి వచ్చినప్పుడల్లా– మేము ఎప్పుడు రామాపురం వచ్చినా ఈ సత్రం లోనే దిగమని చెబుతుంటారు," అన్నది.

రామశాస్త్రి పేరు వినగానే ఉద్యోగి కలవర పడి, "మరిచాను, ఇప్పుడే ఒక గది ఖాళీ అయింది!" అంటూ వాళ్ళకు అప్పటికప్పుడు ఒక గది ఇచ్చాడు.

"రామశాస్త్రి ఎవరు?" అని అడిగాడు కమలా కరుడు, కామాక్షిని.

"ఈ ధర్మసత్రం, తండ్రి జ్ఞాపకార్థం క్రితం సంవత్సరం ఆయనే కట్టించాడు," అన్నది కామాక్షి.

"ఆయన నీకెలా తెలుసు?" అంటూ ఆశ్చర్యపోయాడు కమలాకరుడు.

"లోపలికి వచ్చేముందు, గోడకు తాపడం చేసిన రాతి ఫలకం మీద అక్షరాలు చదివానులెండి!" అంటూ నవ్వేసింది కామాక్షి.

ఆమె తెలివికి నివ్వెరపోయాడు కమలా కరుడు.

వాళ్ళు గబగబా స్నానాలు చేసి గుడికి చేరుకునేసరికి, అప్పుడే గుడితలుపుకు తాళం వేస్తున్న పూజారి, "దర్శనం చేసుకోవడానికి ఇక సాయంత్రం రావలసిందే!" అన్నాడు.

"నాకు ఒక్కరోజే కదా సెలవు దొరికింది. ఇప్పుడేం చేయడం?" అన్నాడు ఆందోళనగా కమలాకరుడు, కామాక్షితో.

"ఏం చేస్తాం, దైవదర్శనం మనకు ప్రాప్తం లేదు. అవ్వఇచ్చినకానుకలు, లోపల పళ్ళెంలో వేయడం కుదరదు కనుక, బయట హుండీలో వేస్తాను," అన్నది కామాక్షి పూజారి వినేలా.

ఆమెకు తెలుసు— హుండీలో వేసిన కానుకలు గుడికి చెందుతాయి. అదే పళ్ళెంలో వేస్తే పూజారికి దక్కుతాయి.

కానుకల మాట చెవిన పడగానే, పూజారి చప్పున గుడి తలుపులు తీస్తూ, "పాపం, దూరం నుంచి వచ్చినట్టుంది! వేగిరందర్శనం చేసుకోండి," అన్నాడు.

దేవుడి దర్శనం తృప్తిగా చేసుకుని, అవ్వ ఇచ్చిన చిన్నమూట పళ్ళెంలో వేసి, భర్తతో బయటకు వచ్చింది కామాక్షి.

"నీ పుణ్యాన అవ్వ మొక్కు తీరింది. ఇంతకూ అవ్వ ఇచ్చిన ఆ కానుక ఏమిటి?" అని అడిగాడు కమలాకరుడు.

"దీపం వత్తులు! ఏవయితేనేం, అవసరంలో ఆదుకున్నాయి," అన్నది కామాక్షినవ్వుతూ.

ఇద్దరూ పెద్ద వీధిలోకి వచ్చారు. అక్కడ పక్కపక్కనే వున్న రెండు బంగారుకొట్లను కామాక్షికి చూపుతూ, కమలాకరుడు, "నువ్వు త్వరగా సత్రానికి వెళ్ళి, బంగారు గాజులు తీసుకురా! ఈ లోపల నేను కొత్తరకం గాజులేవైనా ఉన్నవేమో చూస్తూంటాను," అన్నాడు.



కామాక్షి సత్రానికి తిరిగి వచ్చి, గాజుల కోసం పెట్టె తెరుస్తూండగా, ఒక యువకుడు వచ్చి, "నేను బంగారం కొట్లో పనివాణ్ణి.కొట్టు కట్టేయబోతున్నారు. అయ్యగారు, మిమ్మల్ని అడిగి త్వరగా గాజులు తీసుకు రమ్మన్నారు," అన్నాడు. కామాక్షికి అనుమానం కలిగి, "గాజులతో పాటు చంద్రహారంకూడా మారుస్తారేమో, అయ్యగారిని అడిగిరా!" అన్నది.

ఆ యువకుడు కొద్దిసేపట్లో తిరిగి వచ్చి, "అయ్యగారు, చంద్రహారం కూడా తీసుకు రమ్మన్నారు," అన్నాడు.

వెంటనే కామాక్షి గట్టిగా, "ఒరే, దొంగ వెధవా! ముందు నీకోసం రక్షకభటుల్ని తీసుకు రావాలి," అంటూ కేక పెట్టింది.

మోసకారి తిరిగి చూడకుండా పారిపోయాడు. వీధిలో తన భర్త తనను సత్రానికి

వెళ్ళి గాజులు తీసుకురమ్మనడం విని, వాడు వచ్చివుంటాడని కామాక్షి గ్రహించింది.

తర్వాత, జరిగింది విన్న కమలాకరుడు ఆమె తెలివితేటల్ని ఎంతగానో మెచ్చుకున్నాడు.

ఈ విధంగా, ఒక్కరోజులో పనులన్నీ పూర్తి చేసుకుని, బాడుగబండిలో రామాపురం వదిలి వాళ్ళు తమ ఊరు చేరేసరికి బాగా పొద్దు పోయింది. తమ ఇంటి ముందు బండి దిగి, బాడుగడబ్బు ఇచ్చి బండివాణ్ణి పంపేసి,భార్యా భర్తలు తమ ఇంటి ద్వారాన్ని సమీపించే సరికి, తలుపుకువేసిన తాళం కనిపించలేదు. లోపల ఎవరో మసలుతున్న అలికిడి!

"దొంగలు!" అంటూ కమలాకరుడు అరవ బోయేసరికి, కామాక్షి అతడికి సైగచేసి, ఇంటి తలుపు తడుతూ, "అయ్యా! బాటసారులం. బాగా పొద్దుపోయింది. రామాపురం పెళ్ళికి వెళ్ళాలి. మెడనిండా నగలతో, డబ్బుతో రాత్రి ప్రయాణం ప్రమాదం. ఈ రాత్రి మీఇంట తల దాచుకోనిస్తే, తెల్లవారాక వెళ్ళి పోతాం," అన్నది.

ఆ వెంటనే చింపిరిజుట్టూ, కోరమీసాల వాడొకడు కిటికీలోంచి బయటకు తొంగి చూసి, చప్పున వచ్చి తలుపు తీశాడు. కామాక్షి వాడికి చేతిలో ఉన్న పెట్టెను అందిస్తూ, "ఇందులో పెళ్ళికూతురుకివ్వాల్సిన నగలూ, కొంత డబ్బూ వున్నది. జాగ్రత్తగా దాయండి. తెల్లవారి తీసుకుంటాం," అన్నది.

కోరమీసాలవాడు పెట్టినందుకుని తల ఊపుతూ, పక్కన ఉన్న గదిలోకి వెళ్ళాడు. వెంటనే కామాక్షి ఆ గది తలుపు మూసి బయట గొళ్ళెం పెట్టి, కమలాకరుడితో, "మనం దొంగలని అరిస్తే, వీడు అప్పటివరకూ మూటకట్టుకున్న వస్తువులతో దొడ్డిదారిన పారిపోయేవాడు. ఇరుగుపొరుగు వాళ్ళను నిద్ర లేపితే, కోపం కొద్దీ వీణ్ణి తలా ఒక తన్ను తన్ని చంపేస్తారు. గ్రామతలారివాణ్ణి పిలుచుకు రండి. ఈ వెధవను పెడరెక్కలు విరిచి కట్టి, గ్రామాధికారికి అప్పగిస్తాడు," అన్నది.

భార్య సమయస్ఫూర్తికి నిర్ఘాంతపోయిన కమలాకరుడు ఆమె రెండుచేతులూ పట్టుకుని, "ఇన్నాళ్ళూ నిన్ను పల్లెటూరి మొద్దువనీ, తెలివి తక్కువదానివనీ చులకన చేశాను. నీ తెలివి తేటలు పట్నంలో పుట్టి పెరిగిన ఆడ పిల్లలకన్నా వుండవు.మన ఆచారం ఒప్పుకోదు గనక, క్షమించమని మాత్రం నిన్నడగను. ఏమీ అనుకోకు!" అంటూ, గ్రామ తలారివాడి ఇంటికేసి పరిగెత్తాడు.





# ఇష్టమైనచోటు

రంగాపురం గొప్ప యాత్రాస్థలం. అక్కడ పరమశివుడికి గొప్ప ఆలయముంది. అందమైన ఉద్యానవనముంది. ఆ ఊళ్ళోని నాట్యమందిరంలో ఉదయం నుంచి రాత్రి దాకా నృత్య, సంగీత ప్రదర్శనలు జరుగుతూంటాయి. గ్రంథాలయంలో ఎన్నో అపూర్వ గ్రంథాలున్నాయి.

ఇవన్నీ చూడాలని నరసింహం ఆ ఊరొచ్చాడు. ఆ ఊళ్ళో ఆయన పెదనాన్న రామయ్య వుంటున్నాడు. రామయ్యకు చంద్రం, సోము, గోపి, విశ్వం అనే నలుగురు కొడుకులున్నారు. పెద్దవాడు చంద్రం, నరసింహం ఈడువాడు. నలుగురన్నదమ్ములూ నరసింహం రాకకు ఎంతో సంతోషించి ఊరంతా తిప్పి విశేషాలన్నీ స్వయంగా చూపారు.

"మీ ఊరు చాలాబాగుంది. నాలుగు రోజులుండిపోవాలని వచ్చాను. నలబైరోజులుండాలనిపిస్తున్నది," అని నరసింహం రంగాపురాన్ని మెచ్చుకున్నాడు.

ఇందుకునలుగురన్నదమ్ములూ బ్రహ్మానందపడ్డారు. అయితేవాళ్ళంతటితో ఊరుకోక, అన్నింట్లోకీ నరసింహానికి బాగానచ్చినదేమిటో చెప్పమని నొక్కి నొక్కి అడిగారు.

అప్పుడు నరసింహం, "మనకేచోటు ఇష్టంగా వుంటుందో అక్కడ ఎక్కువసేపు వుండగలుగుతాం. నిజం చెప్పాలంటే ఒక్కొక్కసారి మనకిష్టమైనచోటు మనకే తెలియదు. మీరు నలుగురూ నాలుగు రోజులపాటు, ఈ నాలుగుచోట్లలోనూ గడిపి రండి. ఎక్కడ ఎక్కువ సేపుండగలిగితే, అదే మీకిష్టమైన చోటు. మీ కిష్టమైనచోటు తెలిశాక, నేను నా విషయం చెబుతాను," అన్నాడు.

ఈ సూచన అన్నదమ్ములకు నచ్చింది. వాళ్ళు నాలుగు రోజులపాటు, నాలుగు చోట్లలోనూ గడిపి వచ్చారు. అప్పుడు వాళ్ళకొక

జొన్నలగడ్డ రామలక్ష్మి

విషయం తెలిసివచ్చింది. తమకు నచ్చిన చోటే కాక మిగతా చోట్ల కూడా ఆకర్షణ వుంది. తమకు నచ్చవనుకున్నప్రాంతాల్లో కూడా వాళ్ళు అనుకున్నదానికంటే ఎక్కువ సేపు వుండగలిగారు.

ఇది విన్న నరసింహం వాళ్ళతో, "చూశా రా! మీరు అనవసరంగా భ్రమలో వున్నారు. ఏస్థలానికైనా ఏదో గొప్పతనముంటుంది. విశాలహృదయం వుంటే అన్నీ మనకు నచ్చుతాయి," అన్నాడు.

ఈ సమాధానం అన్నదమ్ముల్లో ఎవరికీ నచ్చలేదు. వాళ్ళు ఏకకంఠంతో, "అలా తప్పించుకునేందుకు వీల్లేదు. నువ్వు కూడా నాలుగు రోజులపాటు, ఆ నాలుగు చోట్లా గడిపిరా! ఎక్కడ ఎక్కువసేపుంటే, అది నీ కిష్టమైనచోటు," అన్నారు.

"అయ్యో! ఇంకామీకు తెలియలేదా? ఈ ఊళ్ళో మనందరికీ ఇష్టమైనచోటు ఒక్కటేనని తేలిపోయింది కదా! ఇంకా పరీక్షలెందుకు?" అన్నాడు నరసింహం.

నిజానికి చంద్రం ఆలయంలోనూ, సోము ఉద్యానవనంలోనూ, గోపి నృత్య మందిరంలోనూ, విశ్వం గ్రంథాలయంలోనూ ఎక్కువ కాలం గడిపారు. అందువల్ల వాళ్ళు నరసింహం మాటలకు తికమకపడి, "నీ మాటలు మాకర్థం కావడంలేదు," అన్నాడు.

నరసింహం చిరునవ్వు నవ్వి, "ఇలాంటి గొప్పవిశేషాలు రంగాపురంలో మాత్రమే వున్నాయనుకుంటున్నారా? ఇంకా ఇంద్రప్రస్థం, హస్తినాపురం, ఉజ్జయిని, తక్షశిల, అమరావతి, విజయనగరం, శ్రీరంగపట్నం వగైరా ఊళ్ళెన్నో వున్నాయి. ప్రతిచోటా ఇంతకంటే గొప్పవీ, ఎంతో ముఖ్యమైన విశేషాలున్నాయి. అయినా, నేనీ ఊరెందుకొచ్చాను? పెదనాన్న ప్రేమను పొందాలనీ, పెద్దమ్మ ఆత్మీయతను రుచిచూడాలనీ, మీతో స్నేహభావం పంచుకోవాలనీ. అలానే ఇక్కడ నా కిష్టమైన చోటు మీ ఇల్లు. ఎక్కడెక్కడ తిరిగినా అక్కడ వుండిపోము కదా! చివరకు ఇంటికి చేరాలనుకుంటాం. అక్కడే వుండాలను కుంటాం. ఈ ఊళ్ళో మీరెక్కడెంతసేపున్నా- ఎక్కువ సేపుండేది మీ ఇంట్లోనే! కాబట్టి, మీ కిష్టమైన చోటు మీ ఇల్లు. ఈ ఊళ్ళో నాకిష్టమైనదీ మీ ఇల్లే! కాదంటారా?" అన్నాడు.

నలుగురన్నదమ్ములూ అవునన్నట్టు సంతోషంగా తలలు ఊపారు.






14

[రూపధరుడి కొడుకైన ధీరమతి తన తండ్రిని గురించి వార్తలు తెలుసుకునేందుకు పైలాస్ వెళ్ళి, తనను చంపటానికి సముద్రం మీద పొంచి వున్న శత్రువులకు అందకుండా తమ పందులకాపరి ఇంటికి వచ్చి అక్కడ తన తండ్రిని కలుసుకున్నాడు. తండ్రికొడుకులిద్దరూ కలిసి శత్రువులను తుదముట్టించడానికి రూపధరుడు ఒక ఆలోచన చేసి, అందుకుగాను ధీరమతి ఏం చెయ్యాలో చెప్పాడు. – తరవాత]

తెల్లవారుతూనే ధీరమతి లేచి నగరానికి ప్రయాణమయ్యాడు. అతను పందులకాపరితో, "చిన్నాయనా, నేను ఇంటికి వెళ్ళాలి. మా అమ్మ నన్ను కళ్ళ చూసిన దాకా బెంగ మానదు. ఇక ఈ ముసలి వాడున్నాడే, ఈయన తిరుగుడు అలవాటు పడ్డవాడు. ఈ మూల కూర్చుంటే ఆయనకేం తోస్తుంది. అందుచేత నగరానికి తెచ్చి దిగబెట్టు. నాలుగు వీధులూ తిరిగి ఆకలి అయితే ఎక్కడో ఒకచోట ఇంత తిండి ముష్టెత్తుకుంటాడు!" అన్నాడు.

"అవును, నాయనా. నన్నిక్కడ ఉండమన్నా ఉండను. ముష్టెత్తుకునేవాడికి అన్నీ తన ఇళ్ళేగా? నువ్వు వెళ్ళు. బాబూ, ఇంకాస్సేపు చలిమంట దగ్గిర కూచుని బయట కాస్త ఎండ ముదిరినాక ఈయనను వెంటబెట్టుకుని నగరానికి పోతాను. నా వంటిన ఉన్న గుడ్డలు చూడు.ఎలా చీలికలూ, పేలికలూ అయి ఉన్నాయో! అందుచేత చలికి తట్టుకోలేను! ఎండ ముదిరి, చలి తగ్గినాక నగరానికి పోతాను," అని రూపధరుడు ధీరమతితో అన్నాడు.



ధీరమతి అతి వేగంగా ఇంటికి వెళ్ళి పోయాడు. తన ఇంట చేరిన దుర్మార్గులతో తానూ, తన తండ్రీ చేయబోయే యుద్ధం గురించే అతను ఆలోచిస్తున్నాడు. అతను ఇల్లు చేరుతూనే తన చేతిలో ఉన్న ఈటెను ఒక స్తంభానికి ఆనించి లోపలికి వెళ్ళాడు. ఇంటి దాసీలు అతన్ని చూసి పరమానందం చెందారు.

ఇంతలోనే పద్మముఖి మేడపైనుంచి దిగి వచ్చి, కొడుకును వాత్సల్యంతో ఆలింగనం చేసుకుని, "వచ్చావా, నాయనా? నిన్ను మళ్ళీ కళ్ళ చూస్తాననుకోలేదు. మీ నాన్న గురించి తెలుసుకుందామనే ఉద్దేశంతో, నాతో కూడా చెప్పకుండా పైలాస్‌కు వెళ్ళి వచ్చావు గదా, ఏం వార్త తెచ్చావు?" అని అడిగింది.

"అమ్మా, నేను వెంట్రుకవాసిలో చావు తప్పించుకున్న మాట నిజమే గాని, మనం కంటతడి బెట్టుతూ కూర్చోవడానికి ఇది సమయం కాదు. నువ్వు వెంటనే చక్కగా స్నానం చేసి, మన పగ తీరేలాగు అనుగ్రహించమని దేవుడికి మొక్కుకో! నేనీలోగా ఒకసారి ఊళ్ళోకి వెళ్ళివస్తాను. అన్నట్టు పైలాస్‌నుంచి నా వెంట ఒకఅతిథి వచ్చాడు. అతనిని తీసుకువస్తాను!" అన్నాడు ధీరమతి.

ఈ అతిథి ఒక జ్ఞాని. పైలాస్ రేవు నుంచి ధీరమతి బయలుదేరే సమయంలో తనను కూడా పడవ ఎక్కించుకోమనిప్రాథేయపడ్డాడు. ధీరమతి పడవ దిగి పందులకాపరి గుడిసెకు వెళ్ళాక అతను మిగిలిన నావికుల వెంట బయలుదేరి మరో మార్గాన నగరం చేరుకున్నాడు.

కొడుకు చెప్పినట్టే పద్మముఖి స్నానం చేసి, శుచి అయిన బట్టలు ధరించి తమ శత్రువుల సంహారం నిర్విఘ్నంగా జరిగేలాగు అనుగ్రహించమని దేవుడికి భక్తిపూర్వకంగా మొక్కుకున్నది.

ఈ లోపల ధీరమతి బయటికి వచ్చి, తన ఈటె చేతబట్టి, తన పెంపుడు కుక్కలు రెంటిని వెంటబెట్టుకుని, ఠీవిగా ఊళ్ళోకి బయలుదేరాడు. ఆ సమయంలో అతని ఇంట చేరిన శత్రువులు అతని చుట్టూ మూగి ఎంతో మంచిగా కుశల ప్రశ్నలు వేశారు; కాని వారి హృదయాలలో ద్వేషాగ్ని ప్రజ్వరిల్లుతూనే ఉన్నది.

ధీరమతి వారిని మెల్లగా వదిలించుకుని ముందుకు సాగి తన తండ్రి తాలూకు మిత్రులు చేరివున్న స్థలానికి వెళ్ళి, అక్కడ

కూచుని వారి ప్రశ్నలకు సమాధానాలు చెప్పసాగాడు.

కొంతసేపటికి అక్కడికి, నావికుల పెద్ద అతిథిని వెంటబెట్టుకుని వచ్చాడు. అతను ధీరమతితో, "ప్రతాపుడు నీకిచ్చిన కానుకలు నా ఇంట ఉన్నాయి. మీ దాసీలను పంపి వాటిని తెప్పించుకో!" అన్నాడు.

"మా ఇంటిని పీడలాగా పట్టిన దుర్మార్గులు ఏ క్షణాన నా పీక కోసి నా సొత్తు పంచుకుంటారో అన్నట్టుగా ఉంది పరిస్థితి. ఈ కానుకలు కూడా వాళ్ళకు దక్కడం దేనికి? ప్రస్తుతం వాటిని మీ ఇంటనే ఉండనీ. ఏనాడు నాకీ పీడ వదిలితే ఆనాడు నువ్వే తెచ్చి వాటిని నా ఇంట పడవెయ్యి," అన్నాడు ధీరమతి.

తరవాత అతను తన అతిథిని వెంటబెట్టుకుని ఇంటికి వెళ్ళాడు. వాకిట్లో ఆసనాలన్నింటి మీదా తివాసీలు పరిచి వున్నాయి. దాసీలు అతిథి చేత స్నానం చేయించి, బట్టలు కట్టబెట్టాక ఆయనా, ధీరమతీ భోజనాలకు కూర్చున్నారు. వారు భోజనం చేస్తున్నంతసేపూ పద్మముఖి వారి కెదురుగా ఒక ఆసనం మీద కూచుని వెనక ఉన్న స్తంభానికి చేరగిలబడి కదురుతో సన్నని నూలు వడకసాగింది.

భోజనాలు ముగిశాక ఆమె తన కొడుకుతో, "నాయనా, ఆ దుర్మార్గులు వచ్చే లోపున, మీ తండ్రి వార్తలు ఏమి తెచ్చావో చెబుదూ," అన్నది.

"అంతా చెబుతానమ్మా! నేను పైలాస్‌కు వెళ్ళి నవద్యోతుణ్ణి చూశాను. ఆయనా, ఆయన కొడుకులూ నన్ను ఎంతో ఆప్యా



యంగా చూశారు; కాని ఆయనకు నాన్నను గురించిన వార్తలేమీ తెలియవు. అందు చేత నేనొక బండిమీద ఆయన కొడుకును వెంట తీసుకుని ప్రతాపుడుండే దేశం వెళ్ళాను. నేను చెప్పిన కథ అంతా విని ప్రతాపుడు మన ఇంట ఉన్న దుర్మార్గులపై మండి పడి, నాన్న తిరిగి వస్తే వీళ్ళందరినీ చిత్ర వధ చేస్తాడన్నాడు. నాన్న ఏదో దీవిలోఉండగా చూసినట్టు సముద్రాల మీద ఉండే ముసలి వాడు తనతో చెప్పినట్టు ప్రతాపుడు నాతో అన్నాడు. ఆ తరవాత నేను ఇంటికి తిరిగి వచ్చేశాను. ఇంతకంటే వార్తలేమీ లేవు," అన్నాడు ధీరమతి.

ఈ మాటలు విన్న అతిథి పద్మముఖితో, "అమ్మా, నిజం నేను చెబుతాను విను. నీ భర్త ఈ దేశానికి వచ్చే ఉన్నాడు. మీ ఇంట్లో

జరుగుతున్న దారుణకాండ గురించిన అన్ని వివరాలూ అతనికి తెలుసు. ఈ దుర్మార్గులకు అతని చేతిలో మూడిందని నా అంతర్వాణి చెబుతున్నది," అని జోస్యం చెప్పాడు.

"బాబూ,మీ నోటి చలవవల్ల అలాగే జర గాలి గాని మీకు ఏమి ఇవ్వమన్నా ఇస్తాను!" అన్నది పద్మముఖి.

లోపల ముగ్గురూ ఈ విధంగా మాట్లాడు కుంటున్న సమయంలో ఇంటి ముందున్న ఆవరణలో దుర్మార్గులందరూ చేరి వ్యాయామపరీక్షలు చేసుకుంటున్నారు. కొందరు బరువులు దూరం విసురుతున్నారు. మరి కొందరు ఈటెలను గురికేసి కొడుతున్నారు. ఇంతలో వారి ముఖ్య నౌకరు వచ్చి, "మిట్ట మధ్యాహ్నమయింది, ఆటలు చాలించి అన్నాలకు పదండి!" అన్నాడు. వెంటనే వాళ్ళందరూ లోపలికి పరుగెత్తుకు వచ్చి ఆసనాలపై చతికిలబడ్డారు. వాళ్ళు ఆ రోజు కోయించిన వేటలన్నీ వండి వారికి వడ్డన చేయగా వారు భోజనాలు చేయసాగారు.

ఈ లోపల అక్కడ పందుల కాపరి రూపధరుడితో, "నిన్ను మా యజమాని తీసుకు పొమ్మన్నాడు గద. పోదాం, బయలుదేరు. ఇప్పటికే ఆలస్యమయింది!" అన్నాడు.

దారివెంట పట్టుకుని నడవటానికి మంచి కర్ర ఉంటే అడిగి పుచ్చుకుని, తన జోలె భుజం మీదుగా వేసుకుని రూపధరుడు పందులకాపరి వెంట బయలుదేరాడు. ముందు పందులకాపరి దారితీస్తూంటే రూపధరుడు దిక్కుమాలిన బిచ్చగాడి రూపంలో, కర్రమీద బరువు మోపి నడిచే వృద్ధుడిలాగా తన సొంత ఇంటికి బయలుదేరాడు.

వారు ఒక జలపాతం ఉన్న చోటికి చేరేసరికి మంచి మంచి గొర్రెలనూ, మేకలనూ తోలుకుంటూ పోతూ కాళుడనే వాడొకడు



అక్కడికి వచ్చాడు. వాడు రూపధరుణ్ణి చూసి వెటకారంగా, "ఎవడీ బిచ్చగాడు? ఒరే పందులు తోలేవాడా, నీకు ఈ పీనుగుఎక్కడ దొరికాడు. వీళ్ళ తాడు తెగ, ఈ బిచ్చగాళ్ళు అడుక్కుతినటానికీ, ప్రజలను వేధించడానికీ తప్ప ఇంకెందుకూ పనికిరారు. ఈ దరిద్రుణ్ణి రూపధరుడి ఇంటికి తీసుకుపోయావో, అక్కడ ఉండే పెద్దమనుషులు వీడి పుట మారుస్తారు! ఛీ, తప్పుడు వెధవ!" అంటూ రూపధరుడి తుంటిమీద ఒక తన్ను తన్నాడు.

రూపధరుడికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. చేతిలో ఉన్న కర్రతో ఒక్క దెబ్బకు వాడి తల పగలగొట్టటమో, వాణ్ణి అమాంతం ఎత్తి రాళ్ళకేసి కొట్టి పామును చంపినట్టు చంపటమో చేద్దామనిపించింది. కాని అందుకు అది సమయం కాదని కోపాన్ని దిగమింగుకున్నాడు.

పందులకాపరి మాత్రం ఆశ్చర్యంతో, "నీకెంత కావరమెక్కిందిరా? యజమాని రానీ నీ ప్రాణాలు తీస్తాడు!" అన్నాడు.

"ఇంకా ఆయన రావలసిందే! ఏనాడో చచ్చాడు! దేవతలు ధీరమతిని కూడా తీసుకుపోతేనే మంచిది. లేకపోతే ఆ పెద్ద మనుషుల చేతిలో చస్తాడు!" అంటూకాళుడు పశువులను తోలుకుంటూ ఇంటికేసి వెళ్ళాడు. వాడు తోలుకుపోతున్న మేకలూ, గొర్రెలూ రూపధరుడి ఇంట చేరిన దుర్మార్గులవిందుకే.

వాడి వెనకగా పందులకాపరీ, రూపధరుడూ వచ్చి చేరారు. రూపధరుడు తన ఇంటికేసి చూసుకుని, "ఈ ఇల్లు రూపధరుడిదే అయి ఉండాలి. ఇంత ఇల్లు అతనికి కాక ఇంకెవరికుంటుంది? లోపల



భోజనాలు జరుగుతున్నట్టున్నది, వాసన తెలుస్తున్నది," అన్నాడు.

"వాసన తెలియకేం జేస్తుంది గాని, మనం ఏం చెయ్యాలో త్వరగా నిర్ణయించు. ముందుగా నువ్వే లోపలికి పోతావా? లేక నన్ను వెళ్ళి రమ్మన్నావా? నువ్వు అట్టేసేపు బయట తారట్లాడావంటే ఎవరో ఒకరు నిన్ను ఇక్కడినుంచి తరిమేస్తారు!" అన్నాడు పందులకాపరి.

వారిలా మాట్లాడుకుంటూండగా అంత దూరాన ఉన్న పెంటపోగు మీద పడుకుని ఉన్న ఒక ముసలికుక్క తల ఎత్తి, చెవులు రిక్కించి రూపధరుడికేసి చూసింది. అది అసలు మంచి వేటకుక్క. దాని పేరు 'కాంతి'. రూపధరుడు దానిని చిన్నపిల్లగా ఉన్నప్పుడు చేరదీసి పెంచాడు. కాని అది

అక్కరకు వచ్చేలోపునే అతను యుద్ధానికి బయలుదేరి వెళ్ళిపోయాడు. ఇప్పుడు కాంతిని గురించి పట్టించుకునేవారు లేరు. అది చాలా ముసలిదై పోయి వంటినిండా గోమార్లు పెట్టుకుని, ఆ పెంటపోగుపైనే ఉంటూ చావు కోసం ఎదురుచూస్తున్నది. అది ఇప్పుడు తన యజమానిని గుర్తించి చెవులు వేలవేసి తోక ఆడించింది; కాని శరీరంలో శక్తి లేక లేవలేకపోయింది. దాన్ని చూడగానే రూపధరుడి కంటి వెంట ఒక బాష్పబిందువు రాలింది. అతను పందులకాపరికేసి తిరిగి, "ఇది చూడటానికి జాతికుక్కలాగే ఉంది. దీన్ని ఇలా అయిపోనిచ్చారేమిటి? ఒకవేళ ఇది అంతగా పనికిరాని కుక్కేమో!" అన్నాడు.

"అలాగా? దాని యజమాని బతికి ఉండగా దాని దర్పం చూడవలసింది!వేటకు పోతే అన్ని కుక్కల కంటే ముందు పరిగెత్తి మృగాన్ని పసికట్టేది. దాని యజమాని ఎక్కడో దిక్కులేని చావు చస్తే, ఇది ఇక్కడ ఈ దిక్కులేని చావు చస్తోంది!" అంటూ పందులకాపరి ముందుకు నడిచి ఇంట్లోకి వెళ్ళిపోయాడు. 'కాంతి' తన యజమానిని చూసిన మరుక్షణం, అందుకే బతికి ఉన్నదానిలాగా కళ్ళుమూసి చనిపోయింది. పందుల కాపరి లోపల అడుగు పెట్టగానే, ముందుగా ధీరమతి అతన్ని చూసి, రమ్మని తల ఊపాడు. పందులకాపరి వెళ్ళి ధీరమతికి ఎదురుగా కూచున్నాడు. అంతలోనే రూపధరుడు కూడా కర్ర మీద బరువు మోపి నడుస్తూ, శతవృద్ధు ఆకారంలో లోపలికి అడుగుపెట్టి, గడప దగ్గరే మండిగాన్ని ఆనుకుని చతికిలబడ్డాడు.

ధీరమతి బల్లమీదనుంచి పెద్ద రొట్టే, పట్టెడు కూరా తీసి పందులకాపరికి ఇచ్చి, "దీన్ని ఆ మనిషికి పెట్టు! అతణ్ణి మిగిలిన వాళ్ళ దగ్గిర కూడా తలా కాస్త అడుక్కోమను," అన్నాడు.

రూపధరుడు పందులకాపరి నుంచి రొట్టే, మాంసమూ అందుకుంటూ, "అయ్యను దేవుడు చల్లగా చూడాలి! ఆయన కోరికలన్నీ ఈడేరాలి!" అని దీవించాడు. అతను ఆ ఆహారం తిని, తాను చతికిలబడిన చోటి నుంచి లేచి, విందు ఆరగించే దుర్మార్గులను సమీపించి, నిజమైన ముసలి బిచ్చగాడిలాగా, ప్రతి మనిషి దగ్గరా చెయ్యిచాచ నారంభించాడు. – (ఇంకా ఉంది)



# చందమామ కబుర్లు

## ఎవరెస్టు విశేషాలు

కొండలెక్కడం అంటే యువతీయువకులకు చాలా సరదా. ఎన్.సి.సి.లో చేరిన విద్యార్థులకు పర్వతారోహణలో శిక్షణ ఇస్తారు. పర్వతారోహణ అనగానే ప్రపంచంలో కెల్లా ఎత్తయిన (8,847 మీ) ఎవరెస్టు శిఖరం గుర్తుకువస్తుంది. ఎవరెస్టు శిఖరారోహణకు కేవలం ఉత్సాహం, శక్తి ఉంటే చాలదు. డబ్బు చెల్లించాలి. ఎంతనుకున్నారు? 10,000 డాలర్లు. అంటే- 3,50,000 రూపాయలు! ఈ మొత్తాన్ని నేపాల్ ప్రభుత్వానికి చెల్లించాలి. ప్రపంచంలో ఎత్తయిన ఎనిమిది శిఖరాలు ఆ ప్రాంతంలోనే ఉన్నాయి. ఈ సీజన్‌లో ఒక్క ఎవరెస్టుకు మాత్రం 80 బృందాలు బయలుదేరాయి. 57 మంది శిఖరాగ్రం చేరుకున్నారు. వారిలో 'ఎవరెస్టు హీరో' టెన్సింగ్ నార్గే మనవడైన 31 సంవత్సరాల జాంగ్లింగ్ నార్గే ఒకడు. అతనితో పాటు ఫిన్లే బ్రిషర్స్, ఎడ్మండ్ కార్ల్ వీస్టర్స్ అనే ఇద్దరు చిత్ర నిర్మాతలు కూడా ఉన్నారు. వాళ్ళు ఎవరెస్టును అధిరోహించడం ఇది మూడవసారి. 1992లో ఎవరెస్టు శిఖరాన్ని 58 మంది అధిరోహించారు. తరవాతి సంవత్సరంలో ఒక్కరోజులోనే 35 మంది శిఖరాగ్రం చేరుకున్నారు. పర్వతారోహకుల నుంచి ఈ సంవత్సరం 640,000 డాలర్లు వసూలు చేసిన నేపాల్ ప్రభుత్వం, 'ఎవరెస్టుమార్గం'లో రద్దీ పెరిగిందని భావిస్తున్నది. అందువల్ల ఒక్కొక్క బృందం, ఒక్కొక్క నిర్ణీతమార్గంలోనే వెళ్ళాలని ఆదేశిస్తున్నది. పర్వతారోహకులు వేసే పనికిరాని వస్తువులను, చెత్తను పోగుచేసి తీసుకురావడానికి షెర్పాలను వినియోగిస్తున్నది. ఇటీవల 2,000 కి.గ్రా. చెత్తను తొలగించారు. ఇంకా 15,000 కి.గ్రా. చెత్తా చెదారం మిగిలి ఉండవచ్చని వెళ్ళి వచ్చిన షెర్పాల నాయకుడు చెప్పాడు.

### సీసాలో సందేశం!

దక్షిణ ఇంగ్లాండు బోగ్నర్ రెజీస్‌కు చెందిన విక్కీ థామస్ అనే ఎనిమిదేళ్ళ అమ్మాయి మూడేళ్ళక్రితం, చీటీరాసి ఒక సీసాలో వేసిబిగించి దానిని సముద్రంలోకి విసిరివేసింది. దానిని ఇటీవల, పశ్చిమ ఆస్ట్రేలియా జెరాల్టన్‌కు చెందిన ఆంద్రూ ఫిట్స్ అనే యువకుడు అందుకుని ప్రత్యుత్తరం కూడా పంపాడు. "ఆ సీసా దాదాపు 16,000 కి.మీ. దూరం ప్రయాణం చేసి వచ్చింది. అదొక పెద్ద రికార్డు," అంటున్నాడతడు. ఇటువంటి రికార్డును నమోదు చేసుడానికి గిన్నిస్ బుక్‌లో ప్రత్యేక ఎంట్రీలు లేకపోవడం దురదృష్టం!

### తిరిగి వచ్చిన ఒంటె!

1991వ సం॥లో గల్ఫ్ యుద్ధం కారణంగా ఏర్పడిన అలజడి వల్ల కువైట్‌లోని ఒక ప్రాంతంలోని కొన్ని ఒంటెలు చెల్లాచెదరై ఎటో పారిపోయాయి. వాటిలో ఒక ఒంటె ఎక్కడెక్కడో తిరిగి ఐదేళ్ళ తరవాత తన యజమాని ఇంటిని వెతుక్కుంటూ వచ్చింది. ఆరోగ్యంగా కనిపించిన ఒంటెను చూసి ఆనందంతో పొంగిపోయిన దాని యజమాని మహ్మద్ అల్ అవ్వాయిషీర్ - ఒంటె విశ్వాసాన్ని పొగుడుతూ ఒక పద్యం రచించాడు!




# గంధర్వగానం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకొని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, కన్ను పొడుచుకున్నా కానరాని చీకటిలో, నక్కల ఊళలూ, గుడ్లగూబల అరుపులూ, విషసర్పాల బుసల మధ్య నువ్వేమి సాధించాలని కఠోరదీక్ష బూనావో అర్థం కావడం లేదు. రాజ్య పాలకుడివైన నువ్వు, నీ కన్న బలవంతుడైన మరొక రాజునుంచి రక్షణ కోసం అలౌకిక శక్తులు సంపాదించాలని ప్రయత్నిస్తున్నావా? లేక రాజులందరినీ జయించి చక్రవర్తి కావాలన్న ఆలోచనలో ఉన్నావా? ఏమైనా, ఇలాంటి ఐహిక సుఖాలూ, పేరుప్రఖ్యాతులూ కాంక్షించే వాడు వాస్తవ జీవిత పరిశీలనాశక్తీ, ఏది సహేతుకం, ఏది కాదు అన్న నిశిత పరిజ్ఞానం కలవాడై ఉండాలి. అలాకాక ఏ

## బేతాళ కథలు



మాత్రం ఆధ్యాత్మిక చింతనా, తాత్విక విష యాలపట్ల ఆసక్తీ ఉన్నవాడైతే మాత్రం,ఎన్నో శ్రమలకోర్చి సాధించినదాన్ని ఇట్టే జారవిడుచుకుంటాడు. ఇందుకు ఉదాహరణగా దేవశర్మ అనే యువకుడి కథ చెబుతాను, శ్రమతెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

దేవశర్మ అనే యువకుడు విశాలదేశంలోని ఒక మారుమూల గ్రామంలో ఉండేవాడు. అతడిది సంగీత విద్వాంసుల కుటుంబం. అతడి తాత వీణ మీద దీపక రాగం వాయిస్తే గుడిలో దీపాలు వెలిగేవట! అతడి తండ్రి నీలాంబర రాగం ఆలపిస్తే, రాళ్ళు కూడా కరిగేవట! పుట్టుకతోనే సంగీతంలో దేవశర్మకు సహజ పాండిత్యం అబ్బింది. చిన్నతనంలోనే తల్లిదండ్రులు పోవడంతో, తమ ఇంట గల తాళపత్రాలు చదివి సంగీత సాధన చేస్తూ, అపారమైన సంగీత జ్ఞానాన్ని సంపాయించాడు.

ఇలా ఉండగా - విశాలదేశపు ఆస్థాన సంగీత విద్వాంసుడు హఠాత్తుగా మరణించాడు. సంగీత విద్యలో పోటీలు పెట్టి, అందులో అంతవరకూ ఎవరూ వినని రాగం పాడి, సభను మెప్పించగల వాణ్ణి, ఆస్థాన విద్వాంసుడుగా నియమించాలని రాజు నిర్ణయించాడు. రాజధానిలో జరగబోయే సంగీత పోటీలలో పాల్గొనవలసిందిగా, దేశం నలుమూలలా చాటింపు వేయించడం జరిగింది.

తన ప్రతిభను నలుగురి ముందూ ప్రదర్శించే అవకాశం వచ్చిందని, రాజుగారి చాటింపు విని దేవశర్మ రాజధానికి బయలుదేరాడు. మర్నాటి అపరాహ్నం వేళకు ఒక అగ్రహారానికి చేరుకున్నాడు. అక్కడ ఒక గృహస్థు అతడికి ఆశ్రయం ఇచ్చాడు. ఆయన ఎనభైఏళ్లవృద్ధుడు,పేరుకశ్యపుడు. ఆయనకు పెళ్ళీడుకొచ్చిన మనమరాలున్నది. ఆయన కూడా సంగీతవిద్వాంసుడే.దేవశర్మ రాజధానికి పోతూన్న పని గురించి విని, అతణ్ణి పాడమన్నాడు. దేవశర్మ గానం విన్నాక, కశ్యపుడు పరమానందంతో అతణ్ణి కౌగలించుకున్నాడు.

"మీ తాతగారిని గురించి విన్నాను.సంగీతంలో వారికి వారే సాటి. ఇప్పుడు నువ్వు పాడిన పాట అమోఘం. అయితే, అది అపూర్వం మాత్రం కాదు!" అని సాలోచనగా ఆగి,"నాకు తెలిసిన ఒక అపూర్వ రాగం ఉంది," అని కశ్యపుడు దాని పూర్వగాథ ఇలా చెప్పాడు:

కశ్యపుడు గురుకులంలో చదువుకుంటున్నప్పుడు, ఒకసారి సమిధల కోసం అడవులలో తిరుగుతూండగా, అతడికి ఒక మృదుమధుర

మైన కంఠస్వరం వినిపించింది. మొదట్లో దానిని ఒక కొత్తరకం పక్షి కూతగా భావించా డతడు. తర్వాత అది కొన్నివేల తుమ్మెదల ఝుంకారనాదమూ అనిపించింది. ఆ ధ్వనిని అనుసరిస్తూ పోయి, అతడొక ముని ఆశ్రమాన్ని చేరుకున్నాడు. అక్కడ ఆ ముని కుమార్తె పూలను దండగా గుచ్చుతూ, తన్మయత్వంతో పాడుతున్నది. కశ్యపుడి రాక చూసి పాడడం ఆపివేసింది. అలాంటి సంగీతాన్ని కశ్యపుడు ఏనాడూ విని ఉండలేదు. అతడు మునికి నమస్కరించి, ఆ రాగాన్ని తనకు నేర్పమని ప్రార్థించాడు.

అప్పుడు ముని, కశ్యపుడికి ఆ గంధర్వ గానాన్ని గురించి చెబుతూ, "నాయనా! అది లోకాతీతమైన గొప్ప రాగం. ఇప్పటికి ఐదారు తరాల ముందు, మా పూర్వీకుడొకడు గంధ మాదన పర్వతం మీద తపస్సు చేసుకునేం దుకు వెళ్ళాడు. ఒకనాడాయన పద్మాసనం వేసుకుని తపస్సుకు ఉపక్రమిస్తూండగా, ఆయన ఏనాడూ విని ఉండని అద్భుత రాగాన్ని పాడుతూ ప్రజ్ఞాపాలుడనే గంధర్వుడు ఆకాశం నుంచి దాపుల నున్న కొలను వద్ద దిగాడు. మా పూర్వీకుడు ఆ గానానికి తన్మ యుడైపోయి, గంధర్వుణ్ణి సమీపించి, "మహాను భావా! ఇప్పుడు మీరు పాడిన రాగం విష్ణు, ఇంద్రాది సభలలో నారద తుంబురులు పాడే రాగంలా ఉన్నది. ఒక్కసారి వింటూనే, ఆ రాగాన్ని కంఠస్థం చేశాను. ధన్యుణ్ణి!" అన్నాడు.

ఇందుకు గంధర్వుడు కోపంగా, "నీ ఊహ సరైనదే! కాని ఈ రాగాన్ని మరొకరికి నేర్పావో, నువ్వాక్షణం దానిని మరిచిపో గలవు," అంటూ శాపం ఇచ్చి మాయమయ్యాడు.



ఆ విధంగా, ఆ గంధర్వరాగం కశ్యపుడి వంశంలోఎవరోఒకరికి సంక్రమిస్తూ వస్తున్నది.

"నాయనా! నాకు తెలిసిన ఈ రాగం మరొకరికి తెలిసే అవకాశం లేదు. ఇది పాడిన వాడిని రాజు తప్పక తన ఆస్థాన సంగీత విద్వాంసుడుగా నియమిస్తాడు,"అని కశ్యపుడు గంధర్వరాగాన్ని కొద్దిగా ఆలాపించి ఆపేశాడు.

కశ్యపుడు ఆలాపిస్తున్నంత సేపూ, దేవశర్మ తన్మయత్వంతో ఊగిపోయాడు. అంత మధుర మైన సంగీతాన్ని అతడేనాడూ విని వుండలేదు.

దేవశర్మ చేతులు జోడించి, "అయ్యా! మధ్యలో ఆపేశారేం? ఈ గంధర్వ రాగలక్షణా లేమిటి? స్వరకల్పన ఏమిటి? పూర్తిగా ఆలా పన, పల్లవి వినిపించండి," అని అడిగాడు ఉత్సాహంగా.



"అంత తొందరెందుకు, నాయనా! దానిని నీకు నేర్పిన మరుక్షణం నేను మరిచిపోతాను. నాకున్న ఆస్తి కేవలం, ఈ సంగీతమే! తల్లీ దండ్రీ లేని పిల్ల, నా మనమరాలిని ఒక ఇంటిదానిని చేయవలసిన బాధ్యత నా మీద ఉన్నది," అని కొద్దిదూరంలో నిలబడి వున్న మనమరాలిని చూపించాడు.

అంతవరకూ అక్కడే నిలబడి అంతా వింటున్న ఆమె, తల వంచుకుని ఏదో పని వున్నదానిలా లోపలికి వెళ్ళిపోయింది.

దేవశర్మ ఒక్క క్షణం ఆలోచిస్తూ వూరు కుని, "అయ్యా! రాజధానికి వెళ్ళడానికిఇంకా మూడు రోజుల వ్యవధి వుంది. ఒక ముఖ్య విషయం మరిచాను. మా ఊరుకు వెళ్ళి రావాలి," అంటూ అప్పటికప్పుడు తిరుగు ప్రయాణం కట్టాడు.

కశ్యపుడి రాగాలాపన దేవశర్మ చెవిలో ఇంకా గింగురుమంటున్నది. ఆ రాగ లక్షణ వివరణ ఎక్కడైనా దొరుకుతుందేమో అని ఇల్లంతా వెతికాడు. తాతల నాటి తాళపత్ర గ్రంథాలన్నీ తిరగేశాడు. కాని, అతడి ప్రయత్నం వ్యర్థమయింది. కశ్యపుడు పాడింది, ఒక అపూర్వ రాగం; అది అతడికొక్కడికే తెలుసు.

దేవశర్మ తిరిగి కశ్యపుడి వద్దకు వచ్చాడు. జపతపాదులు అయ్యాక కశ్యపుడు, దేవ శర్మను ఎదురుగా కూర్చోబెట్టుకుని, వెనక మనమరాలు తంబురా మీటుతూండగా, వీణ వాయిస్తూ, గంధర్వరాగాన్ని వినిపించాడు. ఆ రాగ లక్షణా లను బోధించాడు. దేవశర్మ సాధన చేసి,దానిని వారికి వినిపించాడు. అది విన్న కశ్యపుడు, అతని మనమరాలు ముగ్ధులయ్యారు. దేవ శర్మకు తనొక కొత్తజన్మ ఎత్తినట్లనిపించింది. అతడి ముఖం నూతన తేజంతో వెలిగిపోయింది.

దేవశర్మ ఆనందోద్వేగాన్ని గమనించిన కశ్యపుడి మనమరాలు, "తాతయ్య తన సంగీత సంపదను నా కోసం దాచినట్లు, నన్ను మీరు పెళ్ళి చేసుకుంటానంటేనే, రాగాన్ని మీకు నేర్పే ఉద్దేశం వున్నట్లు,మీతో మాట్లాడారు. మీరు వెళ్ళాక తాతయ్యతో, నా పెళ్ళి విషయం అలా ముడిపెట్టవద్దని చెప్పాను. అందుకు తాతయ్య ఒప్పుకున్నారు. కనక మీరు నన్ను పెళ్ళిచేసు కోవాలన్న నిబంధన ఇప్పుడు లేదు," అన్నది.

"మిమ్మల్ని పెళ్ళి చేసుకోవడానికి నాకెటు వంటి అభ్యంతరం లేదు. అలాంటి అభ్యంతరం వుంటే, మీకే ఏదైనా ఉండాలి. ఎందుకంటే రాజధానికి పోయి సంగీత విద్వాంసుని పోటీలో పాల్గొనే ఆలోచన మానుకున్నాను," అన్నాడు దేవశర్మ నవ్వుతూ.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, దేవశర్మ రాజధానిలో జరిగే సంగీత పోటీలో పాల్గొని, రాజాస్థాన విద్వాంసుడు కాగోరింది, ఐహిక సుఖాలూ, పేరు ప్రఖ్యాతులూ కాంక్షించే గదా? అందుకోసం అతడు కశ్యపుడి నుంచి అపూర్వ మైన గంధర్వరాగాన్ని కూడా నేర్చుకున్నాడు. ఆయన మనమరాలు, ఆ రాగాన్ని తన తాత, దేవశర్మకు బోధించడంలో తనను వివాహం ఆడి తీరాలన్న నిబంధన ఏమీ లేదని కూడా చెప్పింది. అయినా, దేవశర్మ రాజధానికి వెళ్ళే ప్రయత్నం ఎందుకు విరమించుకున్నాడు? తరచి చూస్తే, దేవశర్మలో ఆఖరి క్షణాన ఏదో వైరాగ్యభావం మొలకెత్తినట్లు కనబడుతున్నది? గృహస్థు కాదలచిన వాడు వాస్తవ జీవిత సత్యాలనూ, అందులోని ఒడిదుడుకులనూ మరిచి, మానసిక బలహీనత కొద్దీ సాధించిన దాన్ని జారవిడుచుకోవడం అజ్ఞానం అనిపించు కుంటుంది గదా? ఈ సందేహాలకు తెలిసికూడా సమాధానం చెప్పక పోయావో, నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "నిజమైన కళా కారుడెవడూ కేవలం ఐహిక సుఖాల కోసం, ధనధాన్య సంపత్తి కోసం తన కళను పణం పెట్టడు. దేవశర్మది సంగీతవిద్వాంసుల కుటుంబం. అతడి తాత తండ్రులెవరూ రాజా శ్రయం కోసం తాపత్రయ పడలేదు. ఉన్నంతలో తృప్తిగా జీవిస్తూ, పదిమంది చేతా గౌరవాభి మానాలు పొందారు. అటువంటి కుటుంబంలో పుట్టిన దేవశర్మ – సంగీత పోటీలలో పాల్గొని రాజాస్థాన విద్వాంసుడు కావాలనుకోవడంలో, కొంత మానసిక బలహీనత కనబడుతున్న మాట వాస్తవం. కాని, కశ్యపుడి ద్వారా గంధర్వ రాగం వినగా వచ్చిన అపూర్వానందం అనుభవించాక, దానిని పోటీల్లో పాడి ఇతరుల పరం చేయడం అతడికి పరమ నేరంగా కనబడింది. ఉత్తమ కళయొక్క ప్రప్రథమ ప్రయోజనం, కళారాధ కుడికి ఆత్మానందాన్నివ్వడమే! ఒక కళలో లీనమై తన్మయత్వం చెందిన కళాకారుడు, తన కళకు వేరే ప్రయోజనాన్ని ఆశించడు. ఈ కారణాల వల్ల, దేవశర్మలో మానసిక బలహీనత గానీ, అజ్ఞానం చోటుచేసుకున్న దనుకోవడం గానీ సరికాదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం: రామవరపు గణేశ్వరరావు రచన]





# అచ్చివచ్చిన వేళాకోళం

చంద్రపురంలో సీతయ్య కుటుంబం అతిథి మర్యాదకు పెట్టింది పేరు. ఒకసారి వికారు డనే దూరపు బంధువు వాళ్ళింటికి వచ్చాడు. ఆయనకు పిల్లలను ఏడిపించడం మహా సరదా!

సీతయ్య మనమడు రామానికి పదే ళ్ళుంటాయి. వాడికి చిత్రలేఖనం అంటే చాలా ఇష్టం. రోజూ ఏవో బొమ్మలు గీస్తుంటాడు. వికారుడు చుట్టపుచూపుగా వచ్చాడు కదా అని రామం కష్టపడి గుర్రం బొమ్మ గీసి ఆయనకు చూపించాడు. ఆయన తన బొమ్మను పొగుడుతాడని రామం ఆశించాడు. కానీ, వికారుడు దానిని చూసి వెంటనే గాడిద అంటూ ఫక్కున నవ్వాడు. అప్పుడే అక్కడికి వచ్చిన పక్కింటి కుర్రవాళ్ళు, వికారుడి మాటకు పకపకా నవ్వారు.

రామానికి చాలా అవమానమయింది. అప్పుడు వికారుడు రామంతో, "నువ్వు బొమ్మలు బాగా గీస్తావు. ఇది గాడిద అంటే అచ్చం గాడిదలా ఉంది. అంటే– నువ్వేం చేయాలి? గాడిదబొమ్మ గీయాలంటే గుర్రం బొమ్మ గీయాలనుకోవాలి. అర్థమయిందా?" అన్నాడు.

మళ్ళీ పిల్లలు ఘొల్లుమని నవ్వారు. అప్పుడు వికారుడింకా రెచ్చిపోయి, "ఇక మీదట నువ్వే బొమ్మగీసినా నాకు చూపు తూండు. ఏ బొమ్మ వేస్తే ఏమొస్తుందో చెబుతాను. నువ్వు చిత్రకారుడిగా రాణించ డానికి ఈ విధంగా నేను సాయపడతాను," అన్నాడు.

ఆ మాటలకు అక్కడి పిల్లలు పడి పడి నవ్వారు. రామానికి మాత్రం పౌరుషం వచ్చింది. వాడు తను గీసిన గుర్రం బొమ్మను తీసుకుని పొరుగింటి చంద్రయ్య వద్దకు వెళ్ళాడు.

చంద్రయ్య గొప్ప చిత్రకారుడు. రామాన్ని బొమ్మలు వేయమని ప్రోత్సహించింది

శ్రీరామకమల్

ఆయనే. చంద్రయ్య రామం చెప్పినదంతా విని, వాడు వేసిన, గుర్రంబొమ్మను చూసి, "ఇదివరకటి కన్నా ఇప్పుడు నువ్వు బొమ్మలు బాగా గీస్తున్నావు. కానీ, నీలో తొందరపాటు ఎక్కువ. ఏ విద్యకైనా చాలా శ్రద్ధ కావాలి. నువ్వు శ్రద్ధగా నేర్చుకుంటానంటే నేను నీకు చిత్రకళలోని మెళకువలు చెబుతాను. కొన్నాళ్ళకు నువ్వు చూసింది చూసినట్టు వెయ్యగలుగుతావు," అన్నాడు.

రామంలో అంతకాలం లేని పట్టుదల అప్పుడు వచ్చింది. వాడు ప్రతిరోజూ కొంత సేపు చంద్రయ్య వద్ద కూర్చుని ఏకాగ్రతతో చిత్రకళను అభ్యసించసాగాడు. రోజురోజుకూ వాడి బొమ్మలు మెరుగుపడుతున్నాయి. వికారుడు మాత్రం వాటిని వేళాకోళం చేస్తూనే ఉన్నాడు.

ఇలా రెండు నెలలు గడిచాక రామం ఒక రోజు చంద్రయ్యతో, "నా బొమ్మలను వికారుడు ఏ మాత్రం మెచ్చుకోవడంలేదు. అది నాకు అసంతృప్తిగా ఉంది," అన్నాడు ఎంతో నిరుత్సాహంగా.

చంద్రయ్య కొంతసేపు ఆలోచించి, తానే ఒక బొమ్మ గీసి రామం చేతికిచ్చి, "ఇదినువ్వే వేశానని వికారుడికి చూపించు. ఆ తరవాత ఏం జరిగిందీ వచ్చి నాకు చెప్పు," అన్నాడు.

రామం ఆ బొమ్మను చూశాడు. అది గదాధరుడైన భీమసేనుడిబొమ్మ. బొమ్మలో జీవకళ ఉట్టిపడుతూ ఎంతో బాగుంది. వాడది వికారుడికి చూపించగానే, "నువ్వు ఆంజనేయుడి బొమ్మ వేయాలనుకున్నావు. కాని, జాంబవంతుడిబొమ్మ తయారయింది," అంటూ అపహాస్యం చేశాడు.



"ఇది భీమసేనుడి బొమ్మ," అన్నాడు రామం చిన్నబుచ్చుకుని.

వికారుడు పెద్దగా నవ్వి, "నువ్వు ఒక యుగంలో బొమ్మవేయాలనుకుంటే, ఇంకొక యుగంలో బొమ్మ వస్తోంది," అన్నాడు.

రామం చంద్రయ్య దగ్గరకు వెళ్ళి జరిగిందిచెప్పి, "మీక్కూడా బొమ్మలువేయడం రాదు. అందువల్లనే నాకూ చిత్రకళ అబ్బడం లేదు," అన్నాడు బాధగా.

దీనికి చంద్రయ్య చిన్నగా నవ్వి, "ఆ వికారుడిది మంచిబుద్ధి కాదని నాకు అనుమానంగా ఉన్నది. ఆయన ఎలాంటి వాడు?" అని అడిగాడు.

"రెండు నెలలుగా మా ఇంట్లో తిష్ఠవేశాడు. నిర్మొహమాటంగా అడిగి మరీ అన్నీ వండించుకుని తింటాడు. అందరి చేతా సేవలు చేయించుకుంటాడు. ఇప్పట్లో వెళ్ళేలా లేడని

అంతా విసుక్కుంటున్నారు. ముఖం మీద అనలేక ఊరుకున్నారు," అన్నాడు రామం.

"అయితే నేనొక బొమ్మ వేసిస్తాను. వికారుడితోసహా అంతాకలిసి ఉన్నప్పుడు, ఆయనకు తప్ప మిగతా వాళ్ళందరికీ ఈ బొమ్మను చూపించి నువ్వే వేశానను. వికారుడికి తన వేలితో తన కన్నే పొడుచుకున్నట్టు కాకపోతే నన్నడుగు," అంటూఅప్పటికప్పుడు ఒకబొమ్మ వేసి రామానికిచ్చాడు.

రామం చంద్రయ్య చెప్పినట్లే చేశాడు. ఆ బొమ్మను చూసి వాడి తాత, పంది అన్నాడు. బామ్మ దున్నపోతు అన్నది. తండ్రి గాడిద అన్నాడు. తల్లి ఎద్దు అన్నది. బాబాయిల్లోఒకడు కుక్క అంటే ఇంకొకడు నక్క అన్నాడు.

ఇదంతా చూస్తూ వినోదిస్తూన్న వికారుడు ఉత్సాహంగా, "ఏదీ, నన్ను కూడా ఒకసారి చూడ నివ్వండి నాకేమనిపిస్తుందో చెబుతాను," అంటూ ఆ బొమ్మను తీసుకున్నాడు.

అంతే! అతడి ముఖం పాలిపోయింది.

ఆ బొమ్మ అచ్చం వికారుడిది. గీసిన బొమ్మలో ఏ లోపమూ లేదు.

సీతయ్య కుటుంబానికి తన మీద ఎంత విసుగు, కసి ఏర్పడిందో వికారుడికి అర్థమయింది. ఆ కసి తీర్చుకునే అవకాశం కూడా తానే ఇచ్చాడు. రామం ఎంతబాగా బొమ్మ గీసినా దాన్ని వేరే పేరుతో పిలిచి వినోదించాడు. ఇప్పుడు సీతయ్యకుటుంబం అదేపని చేస్తే తను తప్పు పట్టలేడు కదా!

వికారుడు అప్పటికప్పుడే తన ఊరికి ప్రయాణంకట్టాడు. అంతవరకు ఎంతో సంతోషిస్తూన్న రామంతో సీతయ్య, "నీ బొమ్మలను వేళాకోళం చేయడం వికారుడికి అచ్చిరాలేదు కానీ, మాకు అచ్చివచ్చింది," అన్నాడు.

తాతకు ఏం చెప్పడానికీ తోచక రామం అలాగే నిలబడ్డాడు. అప్పుడు అక్కడికి వచ్చిన చంద్రయ్య, సీతయ్యతో, "రామానికి చిత్రకళ పట్ల ఆసక్తి ఉన్నది. ప్రోత్సహిస్తే మంచి చిత్రకారుడు కాగలడు. అంతేగాని, వాడు గీసే బొమ్మలను వేళాకోళం చేయడం సరికాదు.వెలుగుతూన్న దీపం వత్తిని పుల్లతో ఎగదోసే విధంగా పిల్లలలోని శక్తి సామర్థ్యాలను మంచిమాటలతో ప్రోత్సహించడం పెద్దల బాధ్యత!" అన్నాడు.

సీతయ్య, అవునన్నట్లు రామం కేసి మెచ్చుకోలుగా చూశాడు. రామం సంతోషంగా నవ్వాడు.



# కేరళ భూమి

రచన: మీరానాయర్
చిత్రకారుడు: గోపకుమార్




మన పశ్చిమ తీరం గుండా దక్షిణ దిశగా ప్రయాణం చేస్తే, కర్నాటక – దాదాపు 550 కి.మీ నిడివి గల ఇరుకైన పచ్చటి కేరళ ప్రాంతానికి దారి తీస్తుంది. ఇక్కడ కొబ్బరిచెట్లు విరివిగా ఉండడం వల్ల దీనిని కేరభూమి అన్నారు. ఈ ప్రాంతాన్ని మొదట 'చేరళం' అనేవారు. అంటే– సముద్రం నుంచి బయటపడిన భూమి అని అర్థం. పరశురాముడు తన గొడ్డలిని విసిరి ఈ భూమిని సృష్టించాడని ఒక పురాణ కథ చెబుతుంది. అయినా, భారత భూభాగం ఏర్పడిన చాలా కాలానికి, అగ్నిపర్వతాలు ప్రేలడం వల్ల ఏర్పడిన భూభాగం ఇది అని భూతత్వ శాస్త్రజ్ఞులు అభిప్రాయపడుతున్నారు.

మలబారు ప్రాంతంలో విరివిగా పండే మిరియాల కోసం, క్రీస్తు శకారంభానికి పూర్వం నుంచే ఈజిప్టు, అరేబియా, గ్రీసు, అసీరియా, రోము మొదలైన దేశాల నుంచి వ్యాపారులు వచ్చేవారు. ఉత్తర మలబారు తీరంలో కన్నూర్, తలస్సేరి, కోళికోడ్, పంథలయాని, బేప్పూర్, క్విలాండి రేవులు అభివృద్ధి చెందుతున్నాయి.

ఉత్తర కన్నూర్ జిల్లాలో 216 మీటర్ల ఎత్తయిన ఎళిమలకొండ 250 మీటర్లు సముద్రంలోకి చొచ్చుకుని ఉన్నది. ఎళిమలలో ఒక నౌకాకేంద్రం నిర్మితమవుతున్నది.

భారతీయ సర్కస్ కేరళలోనే ప్రారంభమయింది. మన దేశంలోని దాదాపు అన్ని సర్కస్ కంపెనీలనూ, కన్నూర్, తలస్సేరి

ఎళిమల సమీపంలోని రాతి తీరం

ప్రాంతాల మళయాళీలే నడుపుతున్నారు. కాళారిప్పాయత్ అనే కేరళ యుద్ధవిద్యలో గొప్పవాడుగా పేరు గాంచిన కున్నిరామన్ తలస్సేరిలో 1901వ సం॥లో మొట్టమొదటి సర్కస్ ట్రైనింగ్ ఇన్స్టిట్యూట్ స్థాపించాడు.

తలస్సేరికి దక్షిణంగా మాహే అనే అందమైన తీరపట్టణం ఉన్నది. ఇది పాండిచ్చేరి కేంద్రపాలిత ప్రాంతం కిందికి వస్తుంది. దీనిని ఒకప్పుడు మయ్యాళి అని పిలిచేవారు. కాని ఫ్రెంచివారి కోసం దీనిని పట్టుకున్న కేప్టన్ బెర్ట్రండ్ ఫ్రాంకోయిస్ మాహే డీ లేబర్డోనాయిస్ గౌరవార్థం, దీనికి మాహే అని పేరు పెట్టారు. ఫ్రెంచివాళ్ళు మన దేశం వదిలి వెళ్ళాక, అంతకుముందు వాళ్ళ అధికారంలో ఉన్న ప్రజలకు ఫ్రెంచి పౌరసత్వం ఇచ్చారు. అందువల్ల ఈ కేంద్రపాలిత ప్రాంతంలో ఫ్రెంచి పౌరులయిన భారతీయ సంతతి వారు చాలామంది ఉన్నారు. దూరతీరాలలోని పౌరులకు ప్రాతినిధ్యం వహిస్తూ, ఫ్రెంచి పార్లమెంటులో ఒక సభ్యుడు ఉన్నాడు.



మాహేకు దక్షిణంగా వడక్కెకార అనీ, బడగారా అనీ పిలువబడే పట్టణం వర్తక వాణిజ్యాలకు కేంద్రంగా ఉంటున్నది. మిరియాలు, కొబ్బరికాయలు, వాటికి సంబంధించిన వస్తువులు ఇక్కడి ప్రధాన వ్యాపారవస్తువులు.

ఉత్తర మలబార్ సుప్రసిద్ధ సాహసవీరుడు తచ్చోళి ఒత్తేణన్ జన్మస్థానం బడగారా.తన 32వ యేటే మరణించిన ఆ వీరుడి అద్భుత సాహస కృత్యాలను, ఉత్తర మలబార్‌లో ప్రసిద్ధి గాంచిన జానపద గీతాలయిన వడక్కన్ పాట్టుక్కళ్‌లో వర్ణించబడ్డాయి. ఒత్తేణన్ గౌరవార్థం, బడగార సమీపంలోని ఒక ఆలయంలో యేటా ఉత్సవాలు జరుపుతారు.

ఇక్కడి నుంచి మరికొంత దక్షిణంగా వెళితే, పంథలయాని వస్తుంది. ఇది కొంత చారిత్రక ప్రాముఖ్యత సంతరించుకున్న పట్టణం. 7వ శతాబ్దానికి చెందిన ఒక మసీదు ఇక్కడ ఉన్నది. ఇది అచ్చు మక్కాలోని మసీదులాగే ఉండడం విశేషం. పూర్వకాలంలో


కాళారిప్పాయత్, కేరళ యుద్ధవిద్య

### కోళిక్కోడ్:
### కోడికూత వినిపించే నేల



అరేబియా నుంచి ఈ మార్గం గుండా నౌకలలో వెళ్ళే ప్రయాణీకులు, ఇక్కడ ఆగి ఈ మసీదుకు నమస్కరించి వెళ్ళేవారు.

సముద్రతీరంలో ఈ మసీదుకు సమీపంలో ఒక పాదం గుర్తున్నది. లంకకు వెళుతూ ఆడం భారత భూమి మీద మోపిన పాద ముద్ర ఇది అని ఇక్కడ కొందరు విశ్వసిస్తున్నారు.

దీనికి మరింత దక్షిణంగా ఒకప్పుడు కాలికట్ అని పిలువబడిన కోళిక్కోడ్ ఉన్నది. క్రీ.శ. 9వ శతాబ్దంలో మలబారు ఆఖరిరాజైన చేరమాన్ పెరుమాళ్ మక్కాకు బయలుదేరి వెళ్ళేముందు – తన రాజ్యాన్ని సామంతులకు పంచిపెట్టాడు. ఆ సామంతులలో జామోరిన్ ఒకడు. తాళి గుడిపై నుంచి కోడి కూసే కూత వినించేంత దూరం గల భూమిని, రాజు, జామోరిన్‌కు ఇచ్చాడు. అందుకే ఈ ప్రాంతానికి కోళిక్కోడ్ అనే పేరు వచ్చింది. కోళిక్కోడ్ అంటే కోడి కూత వినిపించే నేల అని అర్థం.

సముద్ర రాజు అనడానికి సంక్షిప్త రూపమైన 'సాముద్రి' అనే మాటే క్రమంగా 'జామోరిన్'గా రూపాంతరం చెందింది. 'జామోరిన్' వంశ పారంపర్యంగా వచ్చే ఒక బిరుద నామం.

కుంజాళి మరక్కార్స్ అనే వీరులయిన సేనా నాయకుల సాయంతో 'జామోరిన్లు' కోళిక్కోడ్‌ను శక్తివంతమైన సంస్థానంగా రూపొందించారు.

15వ శతాబ్దారంభంలో చీనా దేశస్థులు కోళిక్కోడ్‌తో వ్యాపారం చేశారు. బంగారం, వెండి,

జామోరిన్‌ను సందర్శిస్తూన్న వాస్కోడాగామా

రాగి, పట్టు తెచ్చి ఇచ్చి ఇక్కడ లభించే మిరియాలు, యాలకులు, అల్లం, ప్రత్తి దుస్తులను తీసుకువెళ్ళేవారు.

1498వ సం॥లో వాస్కోడాగామా, కోళిక్కోడ్‌కు సమీపంలోనే భారత భూభాగంపై కాలుమోపాడు. ఇదొక గొప్ప చారిత్రాత్మక సంఘటన. మన దేశానికి వాస్కోడాగామా కనుగొన్న సముద్రమార్గం, మన దేశ చరిత్రనే కాకుండా, ఆసియా ఖండంలోని అనేక దేశాల చరిత్ర గతిని కూడా మార్చింది.

జామోరిన్ పోర్చుగీసులను సగౌరవంగానే ఆహ్వానించాడు గాని, వాళ్ళు తీసుకొచ్చిన టోపీలు, చారల బట్టలు, పూసలు, పాత్రలు మొదలైన కానుకలను చూసి సంతోషించలేకపోయాడు. కాలికట్‌లో వ్యాపారం చేసుకోవడానికి వసతులు కల్పించమని పోర్చుగీసులు కోరారు. దానికి జామోరిన్ మొదట విముఖత చూపి నప్పటికీ, ఆ తర్వాత ఒక కోట నిర్మించుకోవడానికి పోర్చుగీసులను అనుమతించాడు.

1615వ సం॥లో మొట్టమొదట ఆంగ్లేయులు కాలికట్‌కు వచ్చారు. కాని, ఇంగ్లీష్ ఈస్టిండియా కంపెనీ టిప్పు సుల్తాన్‌తో చేసుకున్న ఒప్పందం ప్రకారం 1792వ సం॥లోనే కాలికట్ ఆంగ్లేయుల వశమయింది.

కోళిక్కోడ్ ఇవాళ కలపపరిశ్రమకు కేంద్రంగా ఉంటున్నది. ప్రపంచంలోకెల్లా అతి పెద్ద కలప కర్మాగారాలు కొన్ని కోళిక్కోడ్ శివార్లలోని కళ్ళాయ్‌లో ఉన్నాయి.

కోళిక్కోడ్‌కు 9 కి.మీ దక్షిణంగా బేయ్‌పూర్ ఉన్నది. టిప్పుసుల్తాన్ దానికి 'సుల్తాన్ పట్టణ' అని పేరు పెట్టి దానిని తన మలబార్ రాజధానిగా చేసుకున్నాడు. ఈ పట్టణంలో పడవల నిర్మాణ సంస్థ ఉన్నది. కొబ్బరి సంబంధమైన వస్తువుల వ్యాపారం ఇక్కడ విస్తృతంగా సాగుతున్నది.

దుంగలను లాగుతూన్న ఏనుగు. పాత నిబంధన (ఓల్డ్ టెస్టామెంట్) లో ప్రస్తావించబడిన సోలమన్ నిర్మించిన ఆలయంలో కేరళ టేకు కలపను ఉపయోగించారు.





# శిథిలాలయం

పూర్వం దండకారణ్యంలో, రక్తపిపాసుడనే రాక్షసుడుండే వాడు. వాడు ఆకలిగొన్నప్పుడు అడవి జంతువులను వేటాడి తినేవాడు. కాని వాడికి నరమాంస మంటే ఎక్కువ ప్రీతిపాత్రంగా వుండేది. అయితే, ఆ ప్రాంతాల మానవ సంచారం చాలా తక్కువ. నెలకో, రెండు నెలలకో ఎవడైనా మనిషి కంటబడితే, అతిభీకరంగాఅరుపుఅరిచి,పెద్దపెద్ద అంగలు వేస్తూపోయి వాణ్ణి పట్టుకుతిని, ఒక పగలూ, ఒక రాత్రీ తన గుహలో హాయిగా గుర్రు పెడుతూ నిద్రపోయేవాడు.

ఆ అరణ్యంలో ఒక శిథిలాలయం ఉన్నది. అందులో కిరణాక్షిణి అనే దేవత విగ్రహం వున్నది. ఈ కిరణాక్షిణి అద్భుత శక్తులున్న దేవత. ఒకప్పుడు ఆ ప్రాంతాన సర్వ సంపదలతో వర్ధిల్లుతున్న రాజ్యం ఒకటుండేది. ఆ దేవత తన నాశ్రయించిన భక్తులకు వరాలిచ్చి వారి కోర్కెలు తీర్చేది.

ఒకసారి ఆ ప్రాంతంలో మహా భయంకరమైన భూకంపం కారణంగా, రాజ్యంలో ఎక్కువ భాగం మట్టిలో కలిసి పోయింది. బతికి బయట పడినకొద్దిమంది పరాయిప్రాంతాలకు వలస పోయారు. కిరణాక్షిణి దేవాలయం మాత్రం భూకంపానికి తట్టుకుని నిలబడింది. క్రమంగా ఆ రాజ్యభాగమంతా కొన్ని సంవత్సరాలకు మహారణ్యంగా మారి పోయింది.

ఈ అరణ్యాన్ని తన నివాస ప్రాంతంగా చేసుకున్న రక్తపిపాసుడికి, ఒక రాత్రి విపరీతమైన ఆకలి వేసింది. వాడు గుహ నుంచి బయటికి వచ్చి ఏదైనా జంతువు కనబడుతుందేమోనని వెతక సాగాడు. ఆ రోజు నిండుపౌర్ణమి. ఆ సమయంలో కిరణాక్షిణి, శిథిలాలయంలోని విగ్రహం నుంచి బయటకు వచ్చి, వెన్నెల్లో విహరించ సాగింది.

ఎన్. శివనాగేశ్వరరావు



దూరం నుంచి ఆమెను చూసిన రక్త పిపాసుడికి నోరూరింది. వాడు దిక్కులు పిక్కటిల్లే విధంగా పెద్దగా ఒక కేక పెట్టి, కిరణాక్షిణికేసి బయలుదేరాడు. రాక్షసుడు తనను సమీపిస్తున్నంతలో దేవత వాడికేసి తీవ్రంగా చూస్తూ, "ఒరే, రాక్షసాధమా! నేనెవరో ఎరుగక నన్ను భక్షించదలిచావు. నేను కిరణాక్షిణి దేవతను," అన్నది.

అందుకు రాక్షసుడు వికవికమంటూ నవ్వి, "నువ్వెవరైతే నాకేం? నువ్వు ఇప్పుడు నా దృష్టిలో ఆకలి తీర్చే రుచికరమైన భక్ష్యానివి," అన్నాడు.

"నీ అహంకారానికి తగిన శిక్ష విధిస్తాను!" అని కిరణాక్షిణి తన చేతిలోని శూలాన్ని వాడికేసి గురి చేసింది. మరుక్షణం శూలం నుంచి వెలువడిన ఎర్రటి కిరణాలు, రాక్షసుడి కళ్ళకు తాకాయి. వెనువెంటనే వాడు అంధుడై పోయాడు.

దానితో రక్తపిపాసుడికి కిరణాక్షిణి శక్తి తెలిసింది. వాడు ఆమె పాదాల ముందు బోర్లాపడి, "తల్లీ! నాది తెలియని అపరాధం, క్షమించు!" అన్నాడు.

అప్పుడు దేవత కొంత శాంతించి, "ఒరే, కన్నూ మిన్నూ కానని, నీ అహంకారానికి ఏదో కొంత శిక్ష తప్పదు. నీకు ఒక్క కన్ను మాత్రం ప్రసాదిస్తున్నాను," అన్నది.

రక్తపిపాసుడి కళ్ళల్లో ఒకదానికి తిరిగి దృష్టి వచ్చింది. అందుకు వాడు సంతోషించి, "తల్లీ! ఈనాటి నుంచి నేను నీ దాసానదాసుణ్ణి. ప్రతినిత్యం నిన్ను దర్శించేవరం ప్రసాదించు," అని కోరాడు.

దేవత, వాడికి శిథిలాలయం చూపించి, "అదే, నా నివాసం. ఇక మీదట నరమాంస భక్షణ మాని, హేయమైన రాక్షస జన్మనుంచి విముక్తి పొందేందుకు ప్రయత్నించు. సదాచారులైన భక్తుల కోరికలు నేను తప్పక తీరుస్తాను," అన్నది.

రక్తపిపాసుడు ఎంతో భక్తిగా దేవతకు నమస్కరించాడు. ఆమె అంతర్థానమయింది. వాడు అక్కడి నుంచి బయలుదేరి తన గుహ చేరాడు.

ఈ జరిగినదంతా, దాపులనున్న ఒక వటవృక్షం కొమ్మలలో దాగి కూర్చున్న విశ్వనాథుడనే వాడు చూశాడు. వాడు వైశాలి రాజ్యపు గూఢచారి. వాడికి, కిరణాక్షిణి ఎంతటి మహాశక్తిమంతురాలైన దేవతో అర్థమయింది. వాడు చెట్టు దిగి, శిథిలాలయం చేరి, "తల్లీ! జరిగినదంతా

చూశాను. నా కుమారుడు మూగవాడు. ఎన్ని వైద్యాలు చేయించినా ప్రయోజనం లేకపోయింది. వాడికి మాటలు వచ్చేలా దీవించు!" అని ప్రార్థించి వెళ్ళిపోయాడు.

చిత్రంగా – ఆ తర్వాత కొద్దిసేపటికి, గుబురుపొదల చాటు నుంచి వీరబాహు అనే తీర్థయాత్రికుడు బయటకు వచ్చాడు. వాడు, ఉదయపుర రాజ్యపౌరుడు. వాడూ జరిగినదంతా చూశాడు. రాక్షసుడి భయం ఇంకా వాణ్ణి పట్టి పీడిస్తూనే ఉన్నది. వాడు దిక్కులు చూస్తూ శిథిలాలయం దగ్గరకు పోయి, "జగన్మాతా! నేనెంతో కాలంగాసంతాన హీనుణ్ణి. సంతాన ప్రాప్తి కలిగేలా దీవించు!" అని కోరాడు.

కొన్నిరోజుల తర్వాత విశ్వనాధుడూ, వీర బాహూ తమ తమ రాజ్యాలు చేరారు. విశ్వ నాధుడి కుమారుడికి మూగతనం పోయి మాట వచ్చింది.వాడు వైశాలిరాజు చంద్ర కాంతుడికి, అరణ్యంలో జరిగినదంతా వివ రించి, "మహారాజా! తమరు కిరణాక్షిణి ఉండే శిథిలాలయాన్ని పునరుద్ధరణ గావించి, మన రాజ్య ప్రజలు ఆ దేవతను దర్శించే ఏర్పాట్లు చేస్తే, తమ కీర్తి దిగ్దిగంతాలకు వ్యాపిస్తుంది," అన్నాడు.

అదే సమయంతో, ఉదయపుర రాజ్యం చేరిన వీరబాహు, తన భార్య గర్భవతి అయిందని తెలుసుకుని పరమానందం చెంది, తమ రాజైన సూర్యకేతుడికి, శిథిలా లయ పునరుద్ధరణను గురించి, విశ్వనాధుడు తన రాజుకు చెప్పినట్టే చెప్పాడు.

రాజులిద్దరూ కిరణాక్షిణి విగ్రహం ఉన్న శిథిలాలయానికి, కొంత సైన్యాన్ని వెంట బెట్టుకుని బయలుదేరారు. ముందుగా అక్కడికి చేరిన రాజు చంద్రకాంతుడు,దేవీ విగ్రహాన్ని పూజించి బయటికి వచ్చేంతలో, ఉదయపురరాజు కూడా అక్కడికి వచ్చాడు.



ఇద్దరూ, ఒకరికొకరు కంట పడగానే విషయం గ్రహించారు.

ముందుగా చంద్రకాంతుడు, "సూర్య కేతు మహారాజా! ఈ అరణ్యం మా రాజ్య సరిహద్దులలోకి వస్తుంది. కిరణాక్షిణీ దేవికి ఒక మహోన్నతమైన ఆలయాన్ని నిర్మించ దలిచాను," అన్నాడు.

ఇందుకు సూర్యకేతుడు చిన్నగా నవ్వి, "మహారాజా! మీరు పొరబడుతున్నారు. ఈ అరణ్యం మా రాజ్య సరిహద్దులలోనిది. దేవికి ఒకఅపురూపమైన ఆలయం కట్టించాలని సంకల్పించి వచ్చాను," అన్నాడు.

ఈ విధంగా రాజులిద్దరి మధ్యా వివాదం బయలుదేరింది. కొంతసేపటికి వాళ్ళు పట్టరాని ఆగ్రహంతో ఒరనుంచి కత్తులు దూసి, పోరాటానికి సిద్ధమవ్వాల్సిందిగా, తమ తమ సైనికులను హెచ్చరించారు.

సరిగ్గా అదే సమయంలో రక్తపిపాసుడు అటుగా వచ్చి, సంగతి తెలుసుకుని, కోపంతో ఎర్రనైన నిప్పు కణికలా మెరుస్తున్న తన ఒంటికంటితో వాళ్ళకేసి చూస్తూ, "ఒరే, మూర్ఖులారా! యుద్ధం అంటే రక్తపాతం. మీ ఇద్దరూ ఎవరికి వారుగా తమ క్షేమం, తమ రాజ్యపౌరుల క్షేమం చూసుకుంటున్నారే తప్ప, ప్రజలందరి క్షేమం గురించి ఆలోచించడం లేదు. దేవత కోరేది శాంతి; కలహం కాదు. మీరు కలిసికట్టుగా శిథిలాలయాన్ని పునరుద్ధరించి, మీ ఇరురాజ్యాల ప్రజలూ దేవిని దర్శించే ఏర్పాట్లు చేయండి. అలా కాదని రక్తపాతానికి పూనుకున్నారో-నరమాంస భక్షణ మానమని కిరణాక్షిణీ దేవి చెప్పిన హితవు కాదని, ఇప్పుడే మీ ఇద్దర్నీ ఆహారంగా చేసుకోబోతున్నాను!" అంటూ భీకరంగా హుంకరించాడు.

ఆ వెంటనే కిరణాక్షిణి అక్కడ ప్రత్యక్షమై, "రక్తపిపాసా! రాక్షసుడివైనా, నీవు ఈ ఇద్దరు రాజాధముల కంటే వివేకి వనిపించావు. ఇదుగో ఇప్పుడే నీ రెండవ నేత్రానికి కూడా దృష్టిని ప్రసాదిస్తున్నాను!" అని అంతర్థానమైంది.

ఇది చూసిన చంద్రకాంతుడు, సూర్యకేతుడు - దేవత తమను రాక్షసుడి కంటే అధములన్నందుకు సిగ్గుపడి, ఇద్దరూ కలిసికట్టుగా కొద్దికాలంలోనే శిథిలాలయాన్ని పునర్నిర్మించి, తమ రెండు రాజ్యాల ప్రజలు దేవతను దర్శించే ఏర్పాట్లు చేశారు.





చందమామ

# బంగారు గడియలు

## అంతరిక్ష సాహసయాత్ర

అంతరిక్ష యోధుడు దేవా, తొమ్మిది డ్రాగో నివాస స్థావరాలను ధ్వంసం చేయడానికి తన స్పేస్‌క్రాఫ్ట్ క్సేరాలో అంగారక గ్రహం చేరుకున్నాడు.

అప్పుడే -

ఆస్టిరాయిడ్స్! మనల్ని దెబ్బతీశాయి

ఏదైనా దెబ్బతిన్నదా?

లోఆల్టిట్యూడ్ స్టీరింగ్ దెబ్బతిన్నది.

దేవా లక్ష్యాలను పరిశీలించి చూశాడు...

ఇది పాడయ్యేలోగా మనం మూడు మలుపులే తిరగగలం!

మూడు మలుపులు.. తొమ్మిది లక్ష్యాలు. వాటిని ధ్వంసం చేయలేము!

చేయగలం

ఎలా?

# బంగారు గడియలు

# ప్రశ్నావళి



**1**

అంగారకగ్రహ వాసుల దురాక్రమణను చిత్రిస్తూ, 1938వ సం॥లో అమెరికాలో ప్రసారమైన ఒక రేడియో నాటకం వేలాది మంది శ్రోతలను భయభ్రాంతులను చేసింది. ఆ నాటకం ఏ నవల ఆధారంగా రచించబడింది? రచయిత ఎవరు?



**2**

రోమను పురాణాలలోని చంద్రదేవత-
నెలవంక విల్లుగానూ,
వెన్నెల కిరణాలు బాణాలుగానూ కలిగి ఉండేది.
ఆ ప్రాచీన రోము దేవత పేరేమిటి?

**3**

ఖగోళశాస్త్రంలో
'వైట్ డ్వార్ఫ్'
అంటే ఏమిటి?



**4**

ఒక్క గ్రహం తప్ప మిగిలిన గ్రహాలన్నీ పడమర నుంచి తూర్పువైపుకు తిరుగుతూ ఉంటాయి. తూర్పు నుంచి పడమరకు తిరిగే ఆ ఒక్క గ్రహం ఏది?



రెండు నక్షత్ర వీధులకు ఒక పోర్చుగీసు నావికుడి పేరు పెట్టారు. ఆయన పేరేమిటి? నక్షత్ర వీధుల పేరేమిటి?



**5**

**6**

ఉల్కాపాతం వల్ల ఏర్పడిన ఈ అగ్నిపర్వత శిఖర బిలం అడ్డుకొలత 126 మీ. లోతు 183 మీ. భూమిమీది అతి పెద్ద అగ్నిపర్వత బిలాలలో ఇది ఒకటి. ఇది ఎక్కడ ఉన్నది?



**7**

1910వ సం॥లో భూమికేసి ఒక తోకచుక్క వచ్చి కనిపించి వెళ్ళింది. దానిని చూసి ప్రపంచంలోని పలు ప్రాంతాల ప్రజలు భయభ్రాంతులయ్యారు.
ఆ తోకచుక్క పేరేమిటి?



# మౌల్డెడ్ మాస్క్ తయారు చేసుకోండి.

ఇక్కడ చూపిన పద్ధతిలో మీ ముఖానికి సరిపడే మౌల్డెడ్ మాస్క్ సులభంగా తయారుచేసుకోవచ్చు.

1) మీ ముఖం సైజులో, జిగురుతో మౌల్డ్ తయారుచేసి బాగా ఆరనివ్వండి.



2) న్యూస్‌పేపర్‌ను చిన్న చిన్న ముక్కలుగా కత్తిరించి, ఆ ముక్కలను ఒక్కొక్కటిగా మౌల్డ్ మీద జిగురుతో అతికించండి. జిగురు ఆరిన తరవాత, కాగితం ముక్కలమీద మరొక పొర ముక్క లను జాగ్రత్తగా అతికించండి. మళ్ళీ అదేవిధంగా చేయండి. ఇలా మొత్తం నాలుగు పొరలు అతికించుకోండి. ఆ తరవాత దానిని ఒక వారంపాటు అలాగే ఆరనివ్వండి.

3) మాస్క్ పొర బాగా ఆరిన తరవాత, లోపల ఉన్న జిగురు డొప్పను లాగేసి, మాస్క్‌ను సరిదిద్దుకోండి. కళ్ళకూ, ముక్కుకూ, నోటికీ రంధ్రాలు కత్తిరించుకోండి. ఇప్పుడు మాస్క్ మీద మీకు కావలసిన రంగులు వేసుకోవచ్చు. కనుబొమలకూ, మీసాలకూ ఊలును ఉపయోగించవచ్చు.









## సులభమైన మూడు అంచెలలో పిల్లిబొమ్మ గీయండి.





# మహాభారతం

## 27. మైత్రేయుడి శాపం

పాండవులు జూదంలో ఓడి, వనవాసం చెయ్యడానికి ద్రౌపదితో సహా హస్తినాపురం నుంచి అరణ్యాలకు బయలుదేరారు. ఇంద్రసేనుడు మొదలైన వాళ్ళు పధ్నాలుగుమంది సేవకులు రథాలు వెంటబెట్టుకుని వారి వెనకగా వచ్చారు.

దారిలో వారికి వర్ధమానపురం అనే ఊరు తగిలింది. పాండవులు ఆ ఊరిగుండా వెళుతూండగా, హస్తినాపురం నుంచి బయలుదేరి వచ్చిన కొందరు పౌరులు వారిని చేరుకుని, "ధర్మరాజా, మేం లేకుండా మీరెక్కడికి పోతారు? మమ్మల్ని కూడా మీ వెంట తీసుకుపొండి," అన్నారు.

వాళ్ళతో ధర్మరాజు, "మీ సోదరుడి లాంటి వాణ్ణి, నా మనవి కొంచెం వినండి. మాకు రాబోయే కష్టాలు తలుచుకుని మా తాత భీష్ముడూ, మాకు తండ్రి లాటివాడైన ధృతరాష్ట్రుడూ, అంతకన్నా కూడా మా తల్లి కుంతీ తీరని దుఃఖంలో ఉంటారు. మీరు వెళ్ళి వారిని ఓదార్చినట్టయితే నాకు శుభం కలుగుతుంది. వాళ్ళను నేను మీకు అప్పగిస్తున్నాను. మీరు చాలా దూరం వచ్చారు. ఇక తిరిగి వెళ్ళండి," అన్నాడు.

అంత వినయంగా అడిగిన ధర్మరాజు మాట తీసి వెయ్యలేక, ఆ పౌరులు పాండవులను మెచ్చుకుంటూ హస్తినాపురానికి తిరిగి వెళ్ళిపోయారు.

తరవాత పాండవులు రథాలెక్కి గంగా తీరం వెంబడి అరణ్యాలకేసి పోతూ సూర్యాస్తమానమయ్యే వేళకు ఒక పెద్దచెట్టున్న చోటికి చేరుకుని, ఆ రాత్రికి ఆ చెట్టు కింద నిలిచారు. చుట్టుపక్కల గ్రామాల నుంచి అనేకమంది బ్రాహ్మణులు వారి వద్దకు వచ్చి, అనేక పుణ్యకథలు చెప్పి ఆ రాత్రి వెళ్ళబుచ్చారు. తెల్లవారగానే పాండవులు గంగాస్నానం చేసి, అరణ్య మార్గాన



"మా తిప్పలన్నీ మేమే పడతాం. మా మూలంగా మీరేమీ శ్రమ పడవద్దు. మాకు కావలసింది మీ సాంగత్యం మాత్రమే," అన్నారు బ్రాహ్మణులు.

ధర్మరాజు తమ పురోహితుడైన ధౌమ్యుడితో, "మునీశ్వరా, ఈ బ్రాహ్మణులు నావెంట అష్టకష్టాలూ పడటానికి సిద్ధంగా ఉన్నారు. వద్దంటే వినరు. వీళ్ళను అరణ్యంలో ఎలా పోషించాలి? ఏదన్నా ఉపాయం ఉన్నదా?" అన్నాడు.

"ధర్మరాజా, అన్నం ఆదిత్యమయం. నువ్వు సూర్యుణ్ణి ఆరాధించి, సూర్యుడి మహిమ చేత ఈ బ్రాహ్మణులను పోషించు," అని ధౌమ్యుడు ధర్మరాజుకు సూర్యస్తోత్రం ఉపదేశించాడు.

బయలుదేరబోతూ ఉన్న సమయంలో, భిక్షాటన వృత్తిగా గల బ్రాహ్మణులు కొందరు, ధర్మరాజు వెంట అరణ్యవాసానికి వస్తామన్నారు.

"మాకు ఉన్నదంతా పోయి, నియమానికి కట్టుపడి అరణ్యవాసం చెయ్యబోతున్నాం. అరణ్యాలలో మీరెలా జీవిస్తారు. నా కారణంగా మీరు బాధలు పడితే నేను భరించలేను. మీరు మీమీ ఇళ్ళకు పొండి," అన్నాడు ధర్మరాజు.

"నిన్నే నమ్ముకుని వస్తామంటే నువ్వు వద్దనటం భావ్యం కాదు," అన్నారు బ్రాహ్మణులు.

"నేను అసహాయుణ్ణి. నా తమ్ములు అసహాయులు. మీ కోసం కందమూలాలు తెమ్మని నా తమ్ములను కష్టపెట్టలేను," అన్నాడు ధర్మరాజు.

ధర్మరాజు కొన్ని రోజులు నిష్ఠగా సూర్యారాధన చెయ్యగా సూర్యుడు ప్రత్యక్షమై, ఒక రాగి పాత్రను ఇచ్చి, "ధర్మరాజా! ఇది అక్షయపాత్ర. ద్రౌపది కాయలనూ, దుంపలనూ వండి ఇందులో ఉంచితే, వనవాసం పన్నెండేళ్ళూ, నీకూ, నీ అతిథులకూ కావలసిన ఆహారమంతా ఇందులో లభిస్తుంది," అని చెప్పి మాయమయ్యాడు.

ధర్మరాజు ఆ అక్షయపాత్రను ద్రౌపదికి ఇచ్చాడు. అది మొదలు ద్రౌపది కాయగూరలు వండి అందులో ఉంచితే, అందులో నుంచి అన్ని రకాల ఆహారాలూ అంతులేకుండా లభిస్తూ ఉండేవి.

తరవాత పాండవులు గంగా తీరాన్ని వదిలిపెట్టి పడమటగా అరణ్యాల వెంబడి బయలుదేరి యమునా, దృషద్వతీ నదులు గడిచి, సరస్వతీ నదీ తీరాన గల కామ్యకవనం



ధర్మరాజుకు రాజ్యం ఇచ్చి, దుర్యోధన శకుని కర్ణాదులు ధర్మరాజును కొలవనీ. నిండుసభలో దుశ్శాసనుడి చేత ద్రౌపదికీ, భీముడికీ క్షమాపణ చెప్పించు. ధర్మరాజు క్షమాపణ ఆమోదిస్తాడు. నన్ను సలహా అడిగావు గనక చెప్పాను," అని విదురుడు అన్నాడు.

ధృతరాష్ట్రుడు, కోపం వచ్చి, "నా కన్న కొడుకును పరాయివాళ్ళ కోసం ఎట్లా వదులుకుంటాను? నువ్వు ఈ మాట చెప్పదగినదేనా? నేను నిన్ను ఎంత మర్యాదగా చూస్తున్నా నీ కుత్సితబుద్ధి మారదు. నా కొడుకుల బాగు చూడలేవు. నీవి అన్నీ దురాలోచనలు. అవి వింటే నేను నాశనమవుతాను. ఎప్పుడూ పాండవులను ఆకాశానికెత్తుతావు. వాళ్ళ దగ్గిరికే వెళ్ళి ఉండు. లేదా, నీ ఇష్టం వచ్చిన మరోచోటికి వెళ్ళు," అన్నాడు.

వెంటనే విదురుడు రథం తెప్పించి, పాండవులున్న కామ్యకవనానికి వెళ్ళాడు.

విదురడు వెళ్ళే సమయానికి ధర్మరాజు చుట్టూ బ్రాహ్మణులను పెట్టుకుని, కొలువు తీరి ఉన్నాడు. అతను విదురుణ్ణి దూరానే చూసి, భీముడితో, "జూదంలో మనం మన ఆయుధాలు ఓడలేదు కదూ? వాటిని గెలుచుకునేందుకు మళ్ళీ జూదం ఆడరమ్మని పిలవటానికి దుర్యోధనుడు, శకుని విదురుణ్ణి పంపించారల్లే ఉన్నది. లేకపోతే విదురుడు పనిపెట్టుకుని ఇక్కడికి ఎందుకు వస్తున్నట్టు? విదురుడు పిలిస్తే నేను రాకుండా ఉండనని వాళ్ళ ఉద్దేశమేమో! ఏమైనా ఇక నేను జూదం ఆడలేను. అర్జునుడి గాండీ

ప్రవేశించారు. అది చాలా అందమైన ప్రదేశం. అక్కడ అనేకమంది మునులు ఉంటున్నారు.

పాండవులు ఇలా కామ్యకవనంలో ఉండగా, హస్తినాపురంలో ధృతరాష్ట్రుడు విదురుణ్ణి పిలిచి, "విదురా, పాండవులు వనవాసం పోయిన తరవాత ప్రజలు మనకు దూరదూరంగా ఉంటున్నారు. వాళ్ళు మనకేదైనా అపకారం చేస్తారో, ఏమో! వాళ్ళను చేరదీసే ఉపాయం ఏదన్నా ఉంటే చెప్పు," అన్నాడు.

"రాజా, ధర్మార్థకామాలకు ధర్మం మూలం. నీవు ధర్మం పాటించి, పాండవులనూ, నీ కొడుకులనూ కూడా కాపాడుకో. పాండవుల రాజ్యాన్ని శకుని ద్వారా దుర్యోధనుడు మోసం చేసి కాజేశాడు. పాండవులు నీ కొడుకులందరినీ నిర్మూలించగల వాళ్ళు.

వమూ, నీ గదా వాళ్ళు జూదంలో గెలుచు కున్నారంటే ఇక మనకు రాజ్యం ఆశలేదు!" అన్నాడు.

ఇంతలో విదురుడు దగ్గరికి వచ్చాడు.

ధర్మరాజు మొదలైన వాళ్ళు లేచి ఆయనకు ఎదురువెళ్ళి నమస్కారం చేసి తీసుకువచ్చి కూర్చోబెట్టి, ఆయన వచ్చిన పని అడిగారు. ధృతరాష్ట్రుడు తనను హితం అడగడమూ, తాను చెప్పటమూ, అది రుచిం చక ధృతరాష్ట్రుడు తనను వెళ్ళగొట్టటమూ విదురుడు ధర్మరాజుకు తెలిపాడు. అలా అయితే, తనవద్దనే ఉండి, అడుగడుగునా తనకు ఆలోచన చెప్పమన్నాడు ధర్మరాజు విదురుడితో.



విదురుడు కామ్యకవనంలో పాండవులను చేరుకున్నట్టు ధృతరాష్ట్రుడికి తెలిసింది. విదురుడి సలహాతో పాండవులు ఎంత లాభం పొందుతారో అనిపించి ధృతరాష్ట్రుడికి మూర్ఛ వచ్చింది. కొంతసేపటికి ఆయన స్పృహ తెచ్చుకుని, సంజయుడితో, "సంజయా, విదురుడు నా తమ్ముడు, నా స్నేహితుడు. ఎంతో బుద్ధిమంతుడు. కొంచెం కఠినంగా మాట్లాడానని అలిగి, కామ్యకవనానికి వెళ్ళి, పాండవుల దగ్గిర చేరాడు. అతను లేకపోతే నా బుద్ధి పని చెయ్యకుండా ఉన్నది. నువ్వు వెంటనే వెళ్ళి, విదురుణ్ణి తీసుకురా," అన్నాడు పశ్చాత్తాపంతో.

సంజయుడు కామ్యకవనానికి వెళ్ళి, విదురుణ్ణి తీసుకుపోవటానికి వచ్చినట్లు ధర్మరాజుతో చెప్పి, విదురుడితో, "మహా నుభావా, మీరు వచ్చినది మొదలు ధృత రాష్ట్రుడి ప్రాణాలు గిలగిలా కొట్టుకుంటు న్నాయి. మిమ్మల్ని తీసుకురమ్మని నన్ను పంపాడు. మీరు వచ్చి ఆయన ప్రాణాలు నిలబెట్టండి," అన్నాడు.

విదురుడు ధర్మరాజు అనుమతి పొంది, సంజయుడి వెంట హస్తినాపురానికి వచ్చాడు. ధృతరాష్ట్రుడు విదురుణ్ణి కౌగలించుకుని, "నువ్వు చాలా మంచివాడివి. నా మాట పాటించి తిరిగి వచ్చావు. ఇన్ని రోజులూ ఏమీ తోచక కొట్టుకున్నాను. నా తప్పులు క్షమించు," అన్నాడు.

దానికి విదురుడు, "నీ ఆజ్ఞ అయిందని వచ్చాను. నేను నీకు హితమైన మాటలే చెప్పాను. నాకు వాళ్ళూ ఒకటే, వీళ్ళూ ఒకటే. కాకపోతే వాళ్ళు దీనస్థితిలో ఉన్నారు గనక వారిపై జాలి హెచ్చు. అది న్యాయమే కూడా," అన్నాడు.



విదురుడు మళ్ళీ తన తండ్రిని చేరుకునేసరికి దుర్యోధనుడు, కర్ణ శకుని దుశ్శాసనులను పిలిపించి, "మళ్ళీ విదురుడు వచ్చాడు. ఆ పాండవ పక్షపాతి తండ్రికి ఏమి సలహా చెబుతాడో తెలీదు. పాండవులు తిరిగి వచ్చారో, నేను ఆత్మహత్య చేసుకుంటాను," అన్నాడు.

శకుని దుర్యోధనుడితో, "మూఢుడిలాగా మాట్లాడకు. నీ తండ్రి రమ్మన్నా పాండవులు రారు. వచ్చినా, మళ్ళీ ధర్మరాజు చేత జూదం ఆడించి, దేబెలను చేసి పంపేద్దాం," అన్నాడు.

దుర్యోధనుడి కీ మాట రుచించలేదని గ్రహించి కర్ణుడు శకుని దుశ్శాసనులతో, "మనం యుద్ధ సన్నద్ధులమై ఇప్పుడే బయలుదేరి పోయి, అరణ్యంలో ఉన్న అసహాయులైన పాండవులను చంపి వద్దాం. వాళ్ళు బతికి ఉన్నంత కాలమూ మనకు శత్రువులే. ఇప్పుడు కాకపోతే తరవాత వారిని గెలవడం కష్టం," అన్నాడు.

ఈ మాటలకు అందరూ సంతోషించి, సైన్యంతో సహా పాండవుల మీదికి యుద్ధానికి వెళ్ళ నిశ్చయించారు.

సరిగా ఈ సమయంలో వ్యాసుడు ధృతరాష్ట్రుడి వద్దకు వచ్చి, "దుర్యోధనాదులు మాయజూదంలో పాండవులను రాజ్యభ్రష్టులను చేసి, అరణ్యాలకు పంపడం నాకేమీ బాగా లేదు. ఇప్పుడు అరణ్యంలో ఉన్న ఆ పాండవుల మీదికి నీ కొడుకు యుద్ధానికి పోబోతున్నాడు. వెళ్ళాడో, భంగపడి వస్తాడు. నీ కొడుకు చేత ఈ ప్రయత్నం మాన్పించు. నువ్వూ, భీష్ముడూ, ద్రోణుడూ, విదురుడూ ఈ అధర్మాన్ని జరగనిస్తున్నారెందుకు?" అన్నాడు.

దానికి ధృతరాష్ట్రుడు, "మహానుభావా, ఈ జరిగినదంతా మాకెవరికీ ఇష్టం లేదు. కాని పుత్రప్రేమ చేత దుర్యోధనుడికి అడ్డుపడలేకుండా ఉన్నాను. మీరే వాడికి బుద్ధి చెప్పండి," అన్నాడు.

"నేను వెళ్ళాలి. ఇక్కడికి మైత్రేయుడనే ముని వస్తున్నాడు. అతనే నీ కొడుక్కు చెప్పవలసింది చెబుతాడు," అంటూ వ్యాసుడు వెళ్ళిపోయాడు.

వ్యాసుడు చెప్పినట్టే మైత్రేయ మహాముని కొద్ది రోజులకు హస్తినాపురం చేరి, ధృతరాష్ట్రుణ్ణి చూశాడు. ధృతరాష్ట్రుడాయనకు భక్తి శ్రద్ధలతో సమస్తోపచారాలూ చేసి, "మహాత్మా, మీరు ఎక్కడి నుంచి వస్తున్నారు?" అని అడిగాడు.

"నేను తీర్థయాత్రలు చేస్తూ కామ్యకవనానికి వెళ్ళి, అక్కడ పాండవుల వద్ద కొన్ని రోజులుండి, నిన్ను చూసి పోదామని ఇలా వచ్చాను. పాండవులు జడలు దాల్చి, నారబట్టలు కట్టి, ఆకులూ, అలములూ తింటూ, ధర్మానికి బద్ధులై ఆ అరణ్యంలో నానా కష్టాలూ పడుతున్నారు," అన్నాడు మైత్రేయుడు.

వెంటనే ధృతరాష్ట్రుడు, "మునీశ్వరా, పాండవులు క్షేమంగా ఉన్నారు గద? వాళ్ళు నియమాన్ని ఉల్లంఘించే ఆలోచనలో లేరు గద?" అని అడిగాడు.

"వాళ్ళు లోకాలు తలకిందైనా చేసుకున్న నియమాన్ని తప్పరు. అలాటి వాళ్ళకు నీ కొడుకు ద్రోహం చేశాడు! జూదం గురించి అంతా విన్నాను," అని మైత్రేయుడు దుర్యోధనుడితో, "అయ్యా, నీకేమన్నా కాస్త బుద్ధి వుంటే పాండవుల స్నేహం సంపాదించుకో. వాళ్ళు మహాశూరులు. కామ్యకవనంలో భీముడు కిమ్మీరుడనే భయంకర రాక్షసుణ్ణి చంపాడు. అతను బకుణ్ణీ, హిడింబుణ్ణీ, జరాసంధుణ్ణీ చంపిన సంగతి మీకే తెలుసు. ద్రుపదుడి లాటి బలవంతులు వాళ్ళకున్నారు. కృష్ణుడు వాళ్ళ పక్షం. అలాటి వాళ్ళతో నీకు విరోధం దేనికి?" అన్నాడు.

దుర్యోధనుడు ఈ మాటలు విని వేళాకోళంగా తన చేతులతో తొడలు చరుచుకుని, చేతులు పైకెత్తి, కాలి బొటనవేలితో నేల రాచాడు. అది చూసి మైత్రేయుడు కోపించి, "ఆ తొడలు భీముడి గదతో విరుగుగాక!" అని శపించాడు.

ధృతరాష్ట్రుడు ఆందోళనగా, "స్వామీ, అలా జరగకుండా అనుగ్రహించండి," అన్నాడు.

"దానికి ఒకటే మార్గం; నీ కొడుకు పాండవులపై పగ మాని, సఖ్యంగా ఉండటమే," అన్నాడు మైత్రేయుడు.

"కిమ్మీరుడనే వాణ్ణి భీముడు చంపాడన్నారే. ఆ సంగతి కాస్త చెప్పండి," అని ధృతరాష్ట్రుడు అడిగాడు.

"అది నేను చెప్పను. విదురుణ్ణి అడిగితే అతను వివరంగా చెబుతాడు. నేను వెళ్ళి వస్తాను," అంటూ మైత్రేయ మహాముని వెళ్ళిపోయాడు.

"భీముడు కిమ్మీరుణ్ణి చంపాడా!" అని విచారిస్తూ దుర్యోధనుడు సభామందిరం నుంచి అవతలికి వెళ్ళిపోయాడు.



# ఉత్తమనటుడు

అవంతీ రాజ్యంలో దసరా ఉత్సవాలు ఘనంగా జరిగేవి. ఆ పదిరోజులూ ఔత్సాహికులైన కళాకారులు నాటకాలు ప్రదర్శించే వారు. ప్రదర్శనలు పూర్తి అయిన తర్వాత, ఉత్తమ నటుడి ఎంపిక జరిగేది. అతడికి బహుమతితో పాటు, రాజుగారి కొలువులో మంచి ఉద్యోగం కూడా లభించేది. ఇందుకు న్యాయనిర్ణయ సభాపతి మహామంత్రి.

ఒకసారి ప్రదర్శించిన నాటకాలలో ముగ్గురు ఉత్తమ నటన ప్రదర్శించారు. కాకతాళీయంగా ఆ ముగ్గురూ రాజకుమారుడి పాత్రనే పోషించారు. మొదటివాడు రాజుగారి బావమరిదికి దగ్గరి బంధువు, రవి వర్మ. ఒక్క తప్పుకూడా చేయకుండా నటించాడు. రెండవవాడు సైన్యాధిపతి కుమారుడు శశికాంతుడు. ఒక తప్పుతో తర్వాతి స్థానంలో ఉన్నాడు. మూడవవాడు ఒక రైతుకొడుకు జయుడు. వాడు రేండు తప్పులతో చివరి స్థానంలో ఉన్నాడు.

ఉత్తమనటుడిగా రవివర్మ ఎంపిక తథ్యం అనుకున్నారు అందరూ. కాని, జయుడిని న్యాయనిర్ణయసభ ఉత్తమనటుడిగా ప్రకటించింది.

బహుమతి ప్రదానోత్సవం అయిన తర్వాత రాజు, మంత్రితో, "మంత్రివర్యా! ఈ ఉత్తమ నటుడి ఎంపిక నాకు ఆశ్చర్యం కలిగిస్తున్నది!" అన్నాడు.

అందుకు మంత్రి, "మొదటి ఇద్దరూ రాకుమారుడుగా హావభావాలు ప్రదర్శించడానికి పెద్దగా కృషి చేయలేదు. ఆ పాత్రలు వాళ్ళ స్వభావానికీ, నిజ జీవితానికీ దగ్గరలో వుండడంవలన - అవసరం కూడా లేకపోయింది. కాని, రైతుకొడుకు జయుడు రాకుమారుడుగా నటించడానికి చేసిన కృషి, రంగస్థలిపై అతని నటనలో అద్భుతంగా గోచరిస్తున్నది," అన్నాడు.

– తాతానారాయణమూర్తి



# తాడిచెట్టు

కాగితాలు రావడానికి పూర్వం చర్మం మీద, తాళపత్రాల మీద అంటే తాటాకుల మీద రాసేవారు. మనదేశం, నేపాల్, టిబెట్ వంటి దేశాలలో ప్రాచీన పవిత్ర గ్రంథాలను తాళపత్రాల మీద లిఖించేవారు. ఆ పద్ధతి నేపాల్‌లో ఈనాటికీ కొనసాగుతున్నది. మన దేశంలోని కొన్ని గ్రంథాలయాలలో తాళపత్ర గ్రంథాలను భద్రపరచి ఉన్నారు. మద్రాసు విశ్వవిద్యాలయంలోని ఓరియంటల్ మ్యానుస్క్రిప్ట్ లైబ్రరీలోనూ, తంజావూరులోని సరస్వతీ మహల్ గ్రంథాలయంలోనూ పురాతన తాళపత్ర గ్రంథాలు ఉన్నాయి. తాళపత్రాల మీద ఘంటాలతో రాసే అక్షరాలు వేల సంవత్సరాలయినా శిథిలమై పోకుండా ఉండడం విశేషం. తాటాకుల మీద చిత్రాలు కూడా గీస్తారు.

తాడి చెట్టును తమిళంలో పనై అనీ, మలయాళంలో పన అనీ, హిందీలో తాల్ అనీ, గుజరాతీ, మరాఠీ భాషలలో తాడ్ అనీ, బెంగాలీలో తార్ అనీ అంటారు.



కలకత్తా లోని సుప్రసిద్ధ తారకేశ్వరాలయంలో తాడి చెట్టు బోదె నుంచి శివలింగాన్ని మలిచి ప్రతిష్ఠించారు. అందుకే దానికాపేరు వచ్చింది.

మనదేశానికే చెందిన తాడిచెట్లు ఇసుక నేలలో బాగా పెరుగుతాయి. ఎగువ గంగా తీరంనుంచి దక్షిణంగా కన్యాకుమారి వరకు తాడిచెట్లు విస్తరించి ఉన్నాయి. ఈ చెట్లు 60-75 సెం.మీ అడ్డుకొలత కలిగి ఉంటాయి. 30-40 మీ. ఎత్తు పెరుగుతాయి. ఆకులు తలమీద విర బోసుకున్నట్టు విసన కర్రల్లా ఉంటాయి. ఆకులను ఇంటి కప్పుకు ఉపయోగిస్తారు. దీనితోబుట్టలూ, చాపలూ అల్లుతారు. విసన కర్రలూ, గొడుగులూ తయారు చేస్తారు. తాటి నారతో దారాలు పేనుతారు. తాడి నుంచి 'నీరా' అనే పానీయం తీస్తారు. తాటికాయ ముంజలు తినటానికి రుచిగా ఉంటాయి. చలవ చేస్తాయి.

మనదేశపు ఋషులు:

# ఉపమన్యువు

ఉపమన్యువు అయోధధౌమ్యుని శిష్యుడు. విద్యాభ్యాసం పూర్తయిన తరవాత కూడా గురువు ఉపమన్యువును ఇంటికి వెళ్లమని చెప్పలేదు. పైగా, ఆశ్రమానికి చెందిన ఆవులను మేపుకుని వచ్చే పనిని అతనికి పురమాయించాడు.

ఉపమన్యువు గురువు ఆనతి ప్రకారం, ఆవులను పక్కనున్న మైదానానికి తోలుకుపోయి, మేపుకుని సాయంకాలం ఆశ్రమానికి వచ్చాడు. అప్పుడు గురువు, "ఈ రోజంతా మైదానంలోనే గడిపావుకదా! మరి ఆకలికి ఏంచేశావు?" అని అడిగాడు.

"ఆవులు మైదానంలో మేస్తూండగా నేను దాపులనున్న పల్లెకు వెళ్ళి భిక్షమెత్తి ఆకలి తీర్చుకున్నాను," అన్నాడు ఉపమన్యువు.

"ఆవులను అలా వదిలి వెళ్ళకూడదు!" అన్నాడు గురువు.

కొన్నాళ్లు గడిచాక, "ఆకలికి ఇప్పుడేం చేస్తున్నావు?" అని అడిగాడు గురువు.

"ఆవులను ఆశ్రమానికి చేర్చిన తరవాత పల్లెకు భిక్షకు వెళుతున్నాను," అన్నాడు ఉపమన్యువు.

"సాయంకాలం గృహస్థులను ఇబ్బంది పెట్టకూడదు. పైగా నీకు భిక్షగా లభించిన ప్రతిదీ ఆశ్రమానికే చెందుతుంది!" అన్నాడు గురువు.

కొన్నాళ్లు గడిచింది. గురువు మళ్లీ అదే ప్రశ్న అడిగాడు.

"ఆవుల నుంచి పాలు తాగి ఆకలి తీర్చుకుంటున్నాను," అన్నాడు శిష్యుడు.

"నువ్వలా చేయడానికి నేను అనుమతించలేదు కదా!" అన్నాడు గురువు.

కొన్నాళ్ల తరవాత గురువు శిష్యుణ్ణి మళ్లీ అదే ప్రశ్న అడిగాడు.

"లేగదూడలు పాలు తాగిన తరవాత, వాటినోటి నుంచి కారే నురగను తాగి ఆకలి తీర్చుకుంటున్నాను," అన్నాడు శిష్యుడు.

"అది కూడా సరికాదు!" అన్నాడు గురువు.

మరునాడు సాయంకాలం ఉపమన్యువు ఉదయం తోలుకుపోయిన ఆవులు ఆశ్రమానికి తిరిగి వచ్చాయి. కాని, అతడు రాలేదు. గురువు



కొందరు శిష్యులను వెంటబెట్టుకుని ఉపమన్యువును వెతుక్కుంటూ వెళ్లాడు.

ఉపమన్యువు ఒక పల్లంలో పడి మూలుగుతూ కనిపించాడు. గురువు అతన్ని పైకి తీసి, పల్లంలో ఎందుకు పడిపోయాడో అడిగాడు. "ఆకలి తట్టుకోలేక, చెట్టుమీద కనిపించిన ఏదో ఒక ఫలాన్ని కోసితిన్నాను. అది విషఫలం లాగుంది. తిన్న తరవాత కళ్లు కనిపించడం లేదు," అని చెప్పాడు ఉపమన్యువు.

"దృష్టిని ప్రసాదించమని అశ్వినీదేవతలను ప్రార్థించు," అని సలహా ఇచ్చాడు గురువు.

ఉపమన్యువు ప్రార్థించగా అశ్వినీదేవతలు ప్రత్యక్షమై, అతనికి ఆహారం ఇచ్చారు. అయితే, ఉపమన్యువు దానిని ముట్టుకోకుండా వారితో, "నాకు భిక్షగా ఏది లభించినా దానిని మొదట గురువుకు సమర్పించాలి!" అన్నాడు.

"నీ గురుభక్తి అనన్యసామాన్యమైనది. నీకు సాధారణమైన బాహ్యదృష్టితో పాటు అత్యద్భుతమైన అంతర్ దృష్టిని కూడా ప్రసాదిస్తున్నాము!" అని వరాలిచ్చి అశ్వినీదేవతలు మాయమయ్యారు.

పూర్వకాలంలో గురువులు, శిష్యుల మంచిని కోరి, వారిని రకరకాలుగా పరీక్షించేవారు అనడానికి ఉపమన్యువు ఉదంతం చక్కని ఉదాహరణ!

# మీకు తెలుసా?

1. సర్ రోజర్ బానిస్టర్ ఎలా ప్రసిద్ధుడయ్యాడో తెలుసా?
2. అంతరిక్షంలోకి వెళ్ళే వ్యోమగాములకు ఆకాశం నీలంగా కాకుండా వేరొక రంగులో కనిస్తుంది. ఆ రంగు ఏమిటి?
3. 'ఎర్రటిగ్రహం' అని ఏ గ్రహాన్ని పిలుస్తారు?
4. తోలుబొమ్మలు ఎక్కడినుంచి ఆరంభమయ్యాయి?
5. ఆగ్రాను ఏర్పరిచిన వారెవరు? ఎప్పుడు?
6. రజతోత్సవం అంటే ఇరవై ఐదేళ్ళ పండుగ. మరి 'పేపర్ ఆనివర్సరీ' అని దేనిని అంటారు?
7. జిప్సీల భాష ఏది?
8. బాటిక్ శైలి చిత్రాలు ఏ దేశంలో ఆరంభమయ్యాయి?
9. 1921వ సం॥నికి పూర్వం టేబుల్ టెన్నిస్‌కు వేరొక పేరుండేది. ఆ పేరేమిటి?
10. రక్తాన్ని నాలుగు గ్రూపులుగా చెబుతారు. అవి ఏవి?
11. బంగారం, వజ్ర వైడూర్యాల వంటి రత్నాల నాణ్యత కొలమానం ఏమిటి?
12. ఇప్పుడు తపాలాపెట్టెలకు ఎర్ర రంగు వాడతారు. ఒకప్పుడు వేరొక రంగు వాడేవారు. అది ఏమిటి?
13. ఒక అంకెను తప్ప మిగతా వాటిని రోమను పద్ధతిలో రాయవచ్చు. ఆ ఒక్క అంకె ఏది?
14. జీబ్రాల ప్రత్యేకత ఏమిటి?
15. తెల్లఏనుగులు ఎక్కడ ఉన్నాయి?
16. అట్లాంటిక్ మీద ఒంటరిగా విమానం నడిపిన వీరాంగన ఎవరు?

## సమాధానాలు

1. మొట్టమొదట, నాలుగు నిమిషాల్లోపల ఒక మైలు దూరాన్ని పరుగెత్తి దాటాడు.
2. ఊదా.
3. అంగారక గ్రహం.
4. ఈజిప్టు, ఇండియా.
5. సికిందర్‌లోడీ, 1506వ సం॥లో.
6. ప్రథమ వార్షికోత్సవం.
7. రోమనీ.
8. ఇండొనేషియా.
9. 'పింగ్-పాంగ్'.
10. ఏ, బి, ఓ, ఏబి.
11. క్యారెట్.
12. ఆకుపచ్చ.
13. సున్న.
14. ఏ రెండు జీబ్రాలకూ ఒకే రకం చారలు ఉండవు.
15. సయాం (ఈనాటి థాయ్‌ల్యాండ్).
16. అమీలియా ఎర్హార్ట్, 1928వ సం॥లో.

# బంగారు గడియలు ప్రశ్నావళి - నెం.3: సమాధానాలు

1. అహింసకుడు.
2. కుందేళ్ళు. ఆస్ట్రేలియా ఖండానికి దూరం నుంచి వచ్చిన కుందేళ్ళు కొంత కాలానికి విపరీతంగా పెరిగి పోయాయి. అవి పశువులకూ, గొర్రెలకూ మేతకోసం పెంచే పచ్చికను తెగ తినేస్తూ అక్కడి రైతులకు పెద్ద పీడగా తయారయ్యాయి.

3. టిప్పు సుల్తాన్.



4. మూడు. మొదటిది తెల్లదయితే రెండవది నల్లదవుతుంది. మూడవదానితో ఒక జత తయారవుతుంది.

5. సోముడు మొదట ఏనుగును పడవలో నిలబెట్టి, పడవ నీళ్ళలోకి మునిగే మట్టాన్ని గుర్తుపెట్టాలి. ఆ తరవాత అతడు అదే మట్టానికి మునిగేవరకు పడవను ఇసుకతో నింపాలి. ఆ తరవాత అతడు తన 'వేయింగ్ మెషీన్'తో ఇసుక బరువును కనుగొనడం సులభం. అదే ఏనుగు బరువు.



6. మొదట ఫిరంగి గుండ్లను మూడు, మూడు, రెండు-అనే విధంగా మూడు గ్రూపులుగా విభజించుకోవాలి. ఇప్పుడు మొదటి రెండు గ్రూపులకు ఒకదాని కొకటి ఎదురెదురుగా త్రాసు పళ్ళాలలో వేసి తూచాలి.



రెండు గ్రూపులూ సమానంగా ఉన్నట్టయితే మిగిలి ఉన్న రెండు గుండ్లను ఒకదాని కొకటి ఎదురుగా ఉంచి తేడా ఉన్న గుండును కనుగొనవచ్చు. అలాకాకుండా మొదటి రెండు గ్రూపులూ సమానంగా లేనట్టయితే - అందులో తక్కువగా తూగిన రెండు గుండ్లను తీసుకుని ఒకదాని కొకటి ఎదురుగుండా వేసి తేడా ఉన్న గుండును కనుగొనవచ్చు.



7. ఐదు వరుసలలో పది కపాలాలు.





# మారీచుడి చాకచక్యం

ఒకానొకప్పుడు త్రిపురదేశాన్ని చంద్రసేనుడనే రాజు పాలించేవాడు. ఆయన గొప్ప పరిపాల నాదక్షుడు. రాజ్యంలోని నగరాలకూ, గ్రామా లకూ అధికారులను నియమించడమే కాక, ప్రతి నాలుగేళ్ళకూ అధికారులను మార్చు తూండడం ఆయన పద్ధతి. అంతేకాక, అధి కారులపై ఫిర్యాదులుంటే, ఎవరైనా రాజును స్వయంగా కలుసుకుని చెప్పుకోవచ్చు.

త్రిపురదేశంలో ఐరావతమనే గ్రామము న్నది. ఆ గ్రామస్థులందరూ విద్యాధికులు, తెలివైనవారు, సమర్థులు. చంద్రసేనుడా గ్రామానికి విలంబుడనే వాణ్ణి అధికారిగా పంపాడు. విలంబుడు అహంకారి. అందరి మీదా అధికారదర్పం చూపేవాడు. అన్ని పనులూ ప్రజల ఇష్ట ప్రకారం కాక, తన ఇష్ట ప్రకారం జరగాలనేవాడు.

ఐరావతపుర గ్రామస్థులకు విలంబుడి పనితీరు నచ్చలేదు. వాళ్ళందరూ కలిసి తమలో తాముచర్చించుకుని, సుబాహుడనే వాణ్ణి తమ నాయకుడుగా ఎన్నుకున్నారు. సుబాహుడు గ్రామస్థుల తరఫున విలంబుడితో మాట్లాడే వాడు. వాడు గ్రామస్థుల నాయకుడని మొదట్లో కొంతకాలం విలంబుడు గౌరవించాడు.

సుబాహుడు నిక్కచ్చి మనిషి. ముక్కుకు సూటిగా మాట్లాడేవాడు. విలంబుడిలో తప్పుంటే, అది చెప్పడానికి జంకేవాడుకాదు. దాంతో విలంబుడిలో మరింత అహంకారం రేగింది. సుబాహుడిని పలువిధాల ఇబ్బంది పెట్టడం ప్రారంభించాడు.

ఇలా కొన్నాళ్ళు జరిగాక, విలంబుడు, సుబాహుడికి గ్రామబహిష్కారశిక్ష విధించాడు. ఇది తెలియగానే ఊరందరూ ఒక్కటై సుబాహుడి వెనుకనిలిచి, విలంబుడు గ్రామం విడిచి పోవాలన్నారు. విలంబుడుసైనిక సహాయంకోసం రాజుకు కబురంపాడు. విషయమేమిటో తెలుసుకోవాలని చంద్ర

రాయవరపు ఆదినారాయణరావు



సేనుడే స్వయంగా ఐరావతపురం వచ్చాడు. ఆయన జరిగింది తెలుసుకుని విలంబుణ్ణి మందలించాడు. విలంబుడు భయపడి, తన తప్పు ఒప్పుకుని, ఇకముందు బుద్ధిగా ఉంటా నన్నాడు. సుబాహుడందుకు అంగీకరించ లేదు. విలంబుడి స్థానంలో కొత్త గ్రామాధికారిని నియమించమని వాడు పట్టుబట్టాడు.

"విలంబుణ్ణి నాలుగు సంవత్సరాలకు నియమించాను. ఇప్పటికి రెండు సంవత్స రాలే అయింది. గడువుకాలం పూర్తయ్యేదాకా అతణ్ణి కొనసాగనివ్వండి," అని చంద్రసేనుడు గ్రామస్థులకు చెప్పాడు.

సుబాహుడు దీనికి బదులుగా, గ్రామ స్థుల తరఫున, "ప్రభూ! విలంబుడు చేసిన తప్పులు అధికారంలో ఉన్న వారు చేయ తగ్గవికాదు. గ్రామంలో అందరం విద్యా ధికులం కాబట్టి, అతడికి ఎదురు తిరిగాం. చాలా చోట్ల గ్రామస్థులు ఇలాంటి అన్యా యాలు సహించి వూరుకుంటున్నారు. తమరు విలంబుణ్ణి క్షమించి విడిచి పెడితే, అధి కారంలో ఉన్న వారందరూ, పట్టుబడేదాకా ఇలాంటి తప్పులే చేసి వినోదిస్తారు. పట్టు బడ్డాక క్షమాభిక్షకోరి, మళ్ళీ పదవిలో కొనసాగు తారు. అధికారులు తప్పుచేయడానికి భయ పడాలంటే, తమరు విలంబుణ్ణి గ్రామాధికారి పదవినుంచి తొలగించండి," అని చెప్పాడు.

ఈ మాటలు రాజుకు న్యాయంగా తోచాయి. ఆయన వెంటనే విలంబుణ్ణి పదవినుంచి తొలగించి, కొత్తగ్రామాధికారికోసం వెదక సాగాడు. అయితే – ఐరావతపురం గురించి విలంబుడు చాలా దుష్ప్రచారం చేశాడు. దానితో అక్కడి ప్రజలు దుష్టులనీ, ప్రమాద కారులనీ భయపడి, ఆ గ్రామానికి అధికారిగా వెళ్ళడానికి ఒక్కరూ అంగీకరించలేదు.

ఇలాంటి సమయంలో రాజుకు వేరే ఉపాయం తోచక, సుబాహుడికి కబురు పంపి రప్పించి, "నీ గ్రామస్థులు నిన్ను నాయకుణ్ణి చేశారు. నువ్వే గ్రామాధికారివి అయితే బావుంటుంది," అన్నాడు.

సుబాహుడు తల అడ్డంగా ఊపి, "ప్రభువులు నన్ను మన్నించాలి. నేను గ్రామాధికారి అన్యాయాలు ఎదిరించడానికి ప్రజానాయకుడినయ్యాను. ఇప్పుడు నేనే గ్రామాధికారినైతే, అందరూ నన్ను స్వార్థపరు డంటారు. గ్రామాధికారిని కావాలనే గొడవలు తెచ్చానంటారు. నాకే కాదు, మా గ్రామంలో ఎవరికీ పదవి మీద ఆశ లేదు. మమ్మల్ని తప్ప, మీరెవరిని అధికారిగా నియమించినా

మాకు సమ్మతమే. అధికారి నియమం తప్పాడా, నేనతడికి పక్కలో బల్లెంలా వుంటాను," అన్నాడు.

రాజు, వాడినిస్వార్థపరత్వాన్ని మెచ్చుకుని పంపేశాక, మహారాణికి దూరపువరుసలో తమ్ముడి వరస అనిపించుకునే మారీచుణ్ణి కలుసుకుని, "నిన్ను ఐరావతపురానికి గ్రామాధికారిని చేస్తున్నాను. ఆ గ్రామస్థులకు సుబాహుడనే నాయకుడున్నాడు. అతడితో మంచిగా వున్నావంటే,నీకే ఇబ్బందీ వుండదు," అని చెప్పాడు.

ఈ మారీచుడు విద్యాధికుడు. తెలివైన వాడు. సమర్థుడు. వాడికి పదవీ వ్యామోహం లేదు. కానీ రాజు చెప్పడంతో తప్పనిసరై ఒప్పుకున్నాడు.

మారీచుడి పాలనలో ఐరావతపురం మూడుపువ్వులూ, ఆరుకాయలుగా అభివృద్ధి చెందింది. మారీచసుబాహులు మంచి స్నేహితులని పేరు తెచ్చుకున్నారు.

చూస్తూండగానే మూడేళ్ళు గడిచి పోయాయి. ఒకరోజున రాజు, మారీచుడికి కబురుచేసి పిలిపించాడు. ఆయన వాడితో, "నీ గడువు ఏడాదిలో ముగుస్తున్నది. కొత్త గ్రామాధికారినిఎన్నికచేయాలి. ఆర్నెల్లు గడువి స్తున్నాను. నీ ఎరుకలో ఉత్తముడుంటే చెప్పు. లేదా నేనే తగిన వాణ్ణి ఎంపికచేస్తాను," అన్నాడు.

మారీచుడు వినయంగా, "ప్రభూ! నా పాలనలో ఐరావతపురం సుఖశాంతులతో వర్ధిల్లుతున్నది. నేనే మరి నాలుగు సంవత్స రాలు కొనసాగితే బావుంటుందని నాకు తోస్తున్నది. నాకు ఆ గ్రామమన్నా, గ్రామస్థు



లన్నా ఎంతో అభిమానం ఏర్పడింది," అన్నాడు.

చంద్రసేనుడు అయిష్టంగా తలవూపి, "ఒకప్పుడు నీకు పదవీ వ్యామోహం లేదు. కొన్నాళ్ళు పదవిలో వుండేసరికి, నీకు దాన్ని విడిచి పెట్టడం మనస్కరించడం లేదు. ఇది ఉత్తముల లక్షణం కాదు. ఈ నాలుగు సంవత్సరాల నియమాన్ని నేను ఖచ్చితంగా పాటిస్తాను," అన్నాడు.

దీనికి మారీచుడు, "ప్రభూ! ఉచితంగా వుంటుందేమో అని తమకు సలహా ఇచ్చానే తప్ప, నాకు పదవీవ్యామోహంలేదు. పదవీ వ్యామోహం వున్న వాళ్ళు ఐరావతపురంలో నెగ్గుకురాలేరు. నేను తలచుకుంటే నాపదవీ కాలాన్ని మరొక నాలుగేళ్ళు పొడిగించేలా మిమ్మల్నే మార్చగలను. ఏది ఏమైనా, మీ



ఆజ్ఞ నాకు శిరోధార్యం," అని ఐరావతపురానికి తిరిగి వెళ్ళాడు.

ఆనాటి నుంచీ మారీచుడి ప్రవర్తన మారిపోయింది. వాడు సుబాహుడిపై అధికార దర్పం చూపసాగాడు. సుబాహుడేం చేసినా అందులో తప్పులు వెతికేవాడు. సుబాహుడిని రకరకాల ఇబ్బందులకు గురిచేసేవాడు. సుబాహుడూరుకుంటాడా? వాడూ సరికిసరి అన్నట్లుండేవాడు. గ్రామస్థులను మారీచుడిపైకి రెచ్చగొట్టేవాడు. అయితే, మారీచుడు మాత్రం గ్రామస్థులందర్నీ బుజ్జగిస్తూ మర్యాదగా మాట్లాడేవాడు. ఒక్క సుబాహుడి పట్ల మాత్రమే వాడి ప్రవర్తన విపరీతంగా వుండేది.

చివరకు విసిగిపోయిన సుబాహుడు, రాజుకు ఫిర్యాదు పంపాడు. రాజు ఐరావతపురంవచ్చాడు. సుబాహుడాయనకు, మారీచుణ్ణి పదవినుంచి తొలగించమని చెప్పాడు. "మారీచుడు చేసిన తప్పేమిటి?" అని అడిగాడు చంద్రసేనుడు.

"నేను ప్రజానాయకుడినన్న అక్కసుతో, నాతో అమర్యాదగా ప్రవర్తిస్తున్నాడు," అన్నాడు సుబాహుడు.

మారీచుడు దీనికి సంజాయిషీయిస్తూ, "ప్రభూ! తను ప్రజానాయకుడినన్న అహంకారంతో సుబాహుడు దురుసుగా ప్రవర్తిస్తున్నాడు. అతడికి తగ్గట్టే నేనూ ప్రవర్తిస్తున్నాను. అది వ్యక్తిగతం. ఇతరులెవ్వరితోనైనా నేను దురుసుగా, అమర్యాదగా ప్రవర్తించినట్లు రుజువులుంటే, వెంటనే పదవీ విరమణ చేయగలను," అన్నాడు.

చంద్రసేనుడు విచారణ జరిపిన మీదట, మారీచసుబాహుల సమస్య వ్యక్తిగతమని తేలింది. "మీరిద్దరూ మంచివాళ్ళు. సమర్థులు. మీయిద్దరి మధ్యా మనస్పర్థ వుంటే, దాన్ని మీ మధ్యనే వుంచుకోండి. గ్రామాన్ని మాత్రం ఇబ్బందుల పాలుచెయ్యకండి," అని చంద్రసేనుడు ఇద్దరికీ హితవు చెప్పాడు.

అప్పుడు మారీచుడు, "పొరపాట్లు ఇద్దరివల్లా జరిగాయి. నా తప్పు నేను సవరించుకుంటాను. ఇక ముందు ఇలాంటిది నావల్ల జరగనివ్వను," అన్నాడు.

సుబాహుడు కూడా అదే మాట అన్నాక, రాజు, మారీచుణ్ణి ఐరావతపుర గ్రామాధికారిగా మరొక నాలుగు సంవత్సరాలక్కూడా నియామకంచేసి వెళ్ళాడు.

చంద్రసేనుడు రాజధానికి చేరుకున్నాక, విషయంతెలుసుకున్నమంత్రి, "ప్రభూ! కోరి అడిగినప్పుడు మారీచుడిమాటకాదన్నారు.

అప్పట్లో మారీచుడు ఎటువంటి తప్పు చెయ్య లేదు కూడా! ఇప్పుడతడు తప్పు చేశాడు. తప్పుచేశాడని, విలంబుడిని పదవినుంచి తొలగించిన తమరు, తప్పుచేసిన మారీచుడి పదవీకాలాన్ని పొడిగించారు. ఇందుక్కారణం, అతడు తమకు దూరపుబంధువు కావడమే నని పౌరులు పొరబడే ప్రమాదముంది!" అని హెచ్చరించాడు.

మంత్రి మాటలకు చంద్రసేనుడు నవ్వి, "విలంబుడు గ్రామస్థులపట్ల తప్పుచేశాడు. అధికారాన్ని దుర్వినియోగం చేశాడు. అందు వల్ల అతడితప్పు క్షమించ తగ్గది కాదు. విలంబుడి దుష్ప్రచారం వల్ల ఐరావత గ్రామ పౌరులకు చెడ్డపేరు వచ్చింది. ఆ గ్రామానికి అధికారిగా వెళ్ళమంటే, అందరూ నిరాక రించారు. మారీచుణ్ణి నేను బలవంతంగా పంపాను. మారీచుడు సమర్థుడు. అక్కడి పౌరులనుత్వరగా ఆకట్టుకున్నాడు. గ్రామానికి మంచిపేరుతెచ్చాడు. ఆ కారణంగా – గతంలో అక్కడికి వెళ్ళనన్న వారందరూ, ఇప్పుడు అధికారిగా వెళ్ళాలని తాపత్రయ పడుతున్నారు. అంతమంది పోటీపడుతూండడంవల్ల, మారీచుడి పదవీకాలాన్ని పొడిగించకూడదను కున్నాను. కానీ మారీచుడు చాలా తెలివైనవాడు! అసలు విషయం గ్రహించి ఎంతో చాకచక్యంగా గ్రామంలో లేనిపోని గొడవలు సృష్టించాడు. సుబాహుణ్ణి రెచ్చగొట్టాడు. ఐరావతపురంలో కలతలు మొదలయ్యాయి. దాంతో అక్కడికి అధికారిగా వెళతామన్నవారందరూ వెను కంజ వేశారు. ఇప్పుడు మారీచుడికి పోటీ లేదు! నాఅనుమానం, సుబాహుడు ఇందులో మారీచుడికి సహకరించివుంటాడని. ఏది ఏమైనా, గ్రామాధికారి పదవీకాలం నాలుగేళ్ళు మాత్ర మేనన్న నియమం అసంబద్ధమైనదని ఇప్పటికి తెలుసుకున్నాను. అవివేకీ, అసమర్థుడూ, గ్రామప్రజలకు కీడుకలిగించే వాడూ అయిన అధికారి, నాలుగేళ్ళు కాదుగదా, నాలుగు వారాలు కూడా అధికారం చెలాయించ డానికి అనర్హుడు. అలాగే – వివేకీ, సమ ర్థుడూ, ప్రజలకు మేలు చేయగల అధికారి, నాలుగేళ్ళు కాదు గదా, జీవితకాలమంతా అధి కారిగా వుండడానికి అర్హుడు!" అన్నాడు.

మంత్రి వెంటనే, "ప్రభూ! నా సందేహా లన్నీ తొలగిపోయాయి. మారీచ సుబాహు లిద్దరి కంటే తమరే ఎక్కువ తెలివైనవారని నాకు తోస్తున్నది," అన్నాడు మెప్పుకోలుగా.






# లక్ష్మీకటాక్షం

మధురానగరంలో రాఘవయ్య అనే బ్రాహ్మణ యువకుడుండేవాడు. అతనికి "నా" అనే వాళ్ళెవరూ లేరు. పరమ దరిద్రుడు. అయినప్పటికీ ఇతరులను చెయ్యి చాచి యాచించి ఎరగడు. ఊళ్ళో ఉండే వైష్ణ వాలయాన్ని అంటి పెట్టుకుని ఉండి, ఆలయంలోని దేవతలను భక్తితో కొలుస్తూ, అక్కడ ఇచ్చే ప్రసాదంతో కడుపు నింపు కుంటూ ఉండేవాడు. మనిషి చూడటానికి చాలా ఆరోగ్యంగా, పుష్టిగా, ఎంతో కళగా ఉండేవాడు.

ఒకనాడు రాఘవయ్యకు కలలో లక్ష్మీదేవి కనబడి, "నాయనా, నాకు నీ పైన అనుగ్రహం కలిగింది. ఇక నుంచీ నేను నీ వెంటఉండి, నీకు సకలైశ్వర్యాలూ చేకూర్చుతాను," అన్నది.

రాఘవయ్య లక్ష్మీదేవికి నమస్కారం చేసి, "తల్లీ, నీకు నా పైన దయకలిగినందుకు సంతోషం. కాని, ఇంతకాలమూ నీ కటాక్షం లేని కారణం చేతనే నేను నిశ్చింతగా బతుకుతున్నాను. నన్ను గురించి ఒకరికి గాని, ఒకరిని గురించి నాకు గాని బెంగ లేదు. ఏదో ఆ పూజారి ఇచ్చిన దాంతో పొట్టనింపుకుంటూ కాలక్షేపం చేస్తున్నాను. అందుచేత, నీకు వెయ్యి నమస్కారాలు చేస్తాను, నువ్వు నాకు వద్దు!" అన్నాడు.

లక్ష్మీదేవి కోపంగా, "వెర్రివాడా, ప్రారబ్ధం అంత తేలిగ్గా తప్పుతుందనుకుంటున్నావా? నేను నిన్ను పట్టే తీరుతాను," అన్నది.

"తల్లీ, ఒక్క చిన్న విన్నపం. నువ్వు నన్ను ఎప్పుడు వదిలి పోతావో, అది కాస్త చెప్పు, చాలు," అన్నాడు రాఘవయ్య.

"నీతో చెప్పే పోతాను లే," అంటూ లక్ష్మీదేవి అతనికొక గుర్తు చెప్పి మాయ మయింది.

ఆ మర్నాడే ఎవరో కోటీశ్వరుడు ఆల యంలో పూజ చేయించటానికి ఆర్భాటంగా

వచ్చి, రాఘవయ్యను చూశాడు. ఆయనకు రాఘవయ్యను చూడగానే ఏమనిపించిందో మరి, అతనికి నమస్కారం చేసి, పట్టు బట్టలు కట్ట బెట్టాడు. ఆ కోటీశ్వరుడి వెంట వచ్చిన వారందరూ రాఘవయ్య మెడలో పూలమాలలు వేశారు. పూజ అనంతరం పెద్ద సంతర్పణ జరిగింది. రాఘవయ్యకు సుష్టుగా భోజనం పెట్టారు. దేవుడి ప్రసాదం తప్ప షడ్రసోపేతమైన భోజనం ఏనాడూ ఎరగని రాఘవయ్య, లక్ష్మీదేవి అన్నంత పనీ చేస్తున్నదని గ్రహించాడు.



రాత్రి పొద్దు పోయిన దాకా కోటీశ్వరుడి ఇంట భజనలు అవీ జరిగాయి. అంత దాకా రాఘవయ్య కోటీశ్వరుడి బందీగానే ఉన్నాడు. చివరకు తనకు విముక్తి దొరకగానే అతను లక్ష్మీదేవి నుంచి కూడా విముక్తి పొందగోరి తిన్నగా రాజుగారి కోటలోకి నడిచాడు. పట్టెనామాలూ, కొత్త పట్టు బట్టలూ, మెడ నిండా పూలమాలలూ, నిండైన విగ్రహమూ గల రాఘవయ్యను చూసి, వైకుంఠం నుంచి దిగివచ్చిన విష్ణుమూర్తే అయి ఉంటాడని పహరా వాళ్ళెవరూ అడ్డగించ లేదు.

రాఘవయ్య ఎవరి ఆటంకమూ లేకుండా తిన్నగా రాజమందిరంలోకి వెళ్ళాడు. అనేక గదులు దాటగా రాజుగారి శయ్యాగారం వచ్చింది. ఒక మంచం మీద రాణీ, ఇంకొంచెం అవతలి మంచం మీద రాజూ పడుకుని నిద్ర పోతున్నారు. రాఘవయ్య, రాణీని చెయ్యి పట్టుకుని మంచం మీది నుంచి కిందికి జరజరా ఈడ్చాడు. రాణి కెవ్వున అరిచింది. అరుపుకు రాజు లేచి కూర్చున్నాడు. ఎవడో తన భార్యను నేల మీదికి ఈడ్చెయ్యటం రాజు కంట పడింది. రాజు ఆగ్రహావేశంతో తన దిండు కింది నుంచి కత్తి దూశాడు. అంతలోనే రాణిగారి మంచం పందిరి నుంచి బారెడు పొడుగు తాచుపాము పక్క మీద పడింది. రాజుగారి కత్తి దాన్ని నరకటానికి పనికి వచ్చింది.

"మా ప్రాణాలు కాపాడటానికి ఈ అర్ధరాత్రి అవతరించిన శ్రీ మహావిష్ణువులాగున్నారు! తమ రెవరు?" అని రాజు భక్తితో రాఘవయ్యను అడిగాడు.

"నా పేరు రాఘవుడు," అన్నాడు రాఘవయ్య. రాజుకు అతడిలో గురి కుదిరింది. రాచనగరంలోనే అతని కొక మేడ ఇచ్చి, అందులో ఉండి తనను పావనం చెయ్యమని రాజు అతన్ని వేడుకున్నాడు. లక్ష్మీదేవిని

ఓడించటానికి తనకు శక్తి చాలదని గ్రహించి రాఘవయ్య సరేనన్నాడు.

రాఘవయ్యకు సిరి ఎత్తుకున్నది. రాజుగారి ఆదరణతో బాటు అతనికి రాజపరివారంలోని అందరి ఆదరణా లభించింది. రోజూ అతనికి అంతులేని కానుకలు లభించేవి. ఎవరో అతనికి చక్కని, లక్ష్మీదేవిలాటి పిల్లనిచ్చి పెళ్ళికూడా చేశారు. రాఘవయ్యకు నలుగురు పిల్లలు కూడా కలిగారు.

లక్ష్మీదేవి కోసం రాఘవయ్య ఒక పెద్ద ఇనప్పెట్టె ఏర్పాటు చేశాడు. లక్ష్మీదేవి అందులో మూలుగుతూ ఉండేది. ఇలా పన్నెండేళ్ళు గడిచాయి.

ఒక లక్ష్మీవారం సాయంకాలం రాఘవయ్య భార్య మేడ మీది నుంచి మెట్లుదిగి వస్తూ, "దీపాల్లేవు, ధూపాల్లేవు! అందరూ ఎక్కడ చచ్చార్రా?" అని కేక పెట్టింది. రాఘవయ్యకు అదే లక్ష్మీదేవి చెప్పిన గుర్తు!

రాఘవయ్య తన మనస్సులో లక్ష్మీదేవికి దణ్ణం పెట్టుకుని, "ఆహా! వెళ్ళి వస్తావా, తల్లీ? వెళ్ళు," అనుకుని తన భార్యతో, "నన్నేమీ అడగకు. ఇనప్పెట్టెలో ఉన్న దంతా ఊడ్చేసుకుని, నువ్వూ, నీ పిల్లలూ మీ పుట్టింటికి వెళ్ళిపొండి," అని చెప్పి, ఆ రాత్రే వాళ్ళను పంపేశాడు.

రాజుగారు వేటకు వెళ్ళినప్పుడల్లా రాఘవయ్యను వెంట తీసుకుపోయేవాడు. రాఘవయ్య తన భార్యనూ, పిల్లలనూ పంపేసిన మర్నాడే రాజు వేటకు బయలు దేరుతూ రాఘవయ్యను కూడా తీసుకు పోయాడు. ఆ రోజు మధ్యాహ్నమయ్యేసరికి రాజుగారూ, వేటగాళ్ళూ బాగా అలిసిపోయారు. ఎండవేళ రాజుగారు రాఘవయ్య తొడ మీద తలపెట్టుకుని ఒక చెట్టు నీడన నిద్ర పోయాడు. వేటగాళ్ళు దూరదూరంగా చెట్ల కింద చేరారు.



అకస్మాత్తుగా చెట్టు మీది నుంచి ఒక కాకి రాజుగారి మెడ మీద రెట్ట వేసింది. గాఢనిద్రలో ఉండి రాజుగారు నిద్ర లేవలేదు. రాజుగారి తల కదిలించకుండా ఆ రెట్ట తీసే ఉపాయం తోచక రాఘవయ్య చాలాసేపు తికమక పడ్డాడు. ఇంతలో అతనికి రాజుగారి బొడ్డులో ఉన్న చిన్న బాకు కనిపించింది. రాఘవయ్య ఆ బాకును ఒర నుంచి తీసి, దానితో రాజుగారి మెడ మీద ఉన్న రెట్ట తీసేయబోయాడు. అంతలోనే రాజుగారు కళ్ళు తెరిచి, తన మెడ మీదికి వస్తున్న బాకును చూసి, "ద్రోహీ! ద్రోహీ!" అని కేకలు పెడుతూ లేచి కూర్చున్నాడు. రాజభటులు పరిగెత్తుకుంటూ వచ్చారు.

"నా పంచ చేరి నా ప్రాణాలకే ఎసరు పెట్టిన ఈ ద్రోహిని బంధించండి," అని రాజు తన భటులను ఆజ్ఞాపించాడు.

రాఘవయ్యను పెడరెక్కలు విరిచికట్టి నగరానికి తీసుకుపోయారు.

మర్నాడు విచారణ. రాజుగారు నిండు సభలో రాఘవయ్య మీద రాజద్రోహ నేరం ఆరోపణ చేసి, "ఏం చెప్పుకుంటావు?" అని అడిగాడు.

"నే నేమీ చెప్పుకోను. మీకు తోచిన శిక్ష విధించండి," అన్నాడు రాఘవయ్య.

"నీకు ఉరిశిక్ష విధిస్తున్నాను. నీ ఆఖరి కోరిక ఉంటే చెప్పు, తీరుస్తాం," అన్నాడు రాజు.

"నా ఇనప్పెట్టెలో ఒక చందుగాయిపెట్టె ఉన్నది. అందులో నా నిక్షేపం ఉన్నది. దాన్ని ఒక్కసారి కళ్ళ చూడనిచ్చి తరవాత మరణ దండన విధించండి," అన్నాడు రాఘవయ్య.

రాజోద్యోగులు వెళ్ళి ఇనప్పెట్టె తెరిచి చూస్తే అంతా ఖాళీగా ఉన్నది. అందులో ఉన్న చందుగాయిపెట్టె తెచ్చి, రాజసభలో తెరిచారు. అందులో ఒక నీరుకావి పంచే, ఒక చిన్న చెంబూ మాత్రమే ఉన్నాయి.

"ఇవా నీ నిక్షేపం?" అని రాజు అడిగాడు.

"అవును, మహారాజా. వాటిని నమ్ముకున్నంత కాలమూ నేనే కష్టమూ ఎరగను. ఇంతలో నాకు లక్ష్మీకటాక్షం సంప్రాప్తమయింది. అది శాశ్వతం కాదనీ, ఈ స్థితి ఎప్పటికైనా వస్తుందనీ తెలిసే వాటిని భద్రంగా దాచి ఉంచాను. వాటిని నాకు ఇప్పించినట్టయితే నా మానాన నేను పోతాను," అన్నాడు రాఘవయ్య. రాజు ఆశ్చర్యపడి రాఘవయ్యను పోనిచ్చాడు.



# ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1996 అక్టోబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



MAHANTESH C. MORABAD



MAHANTESH C. MORABAD

* పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * ఆగస్టు నెల15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. * మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. * వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:

చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026

---

## జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : భక్తి తోడి సేవ!

రెండవ ఫోటో : భుక్తి కిదే త్రోవ!

పంపినవారు : సి. మనోజ్ఞ, D/o, సి. శ్రీనివాస్
III క్రాస్ రోడ్
రాంజీ నగర్, నెల్లూరు - 524002 (ఆం.ప్ర)

---


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 72-00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - **600 026**

Printed by B.V. REDDI at Prasad Process private Ltd., 188, N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

